# స్వాతంత్ర్యోద్యమంలో
# ముగ్గురు తెలుగు మహిళలు

రచన :
డా॥ వాసా ప్రభావతి M.A Ph.D.
హైదరాబాదు

ప్రచురణ :
**జాలీ ఫ్రెండ్స్ కల్చరల్ అసోసియేషన్**
(మహిళావిభాగం)
మలక్‌పేట్, హైదరాబాదు.

**Three Promenent Telugu Ladies in Indipendent Movement**

*by*

**Dr. Vasa Prabhavati** M.A. Ph.D.

First Edition December 1996
Second Edition July 1997

**Rs. 25/-**

*Copies*

**Visalandhra Book House,**
Bank Street, Hyderabad.,

**Navayuga Book House,**
Sultanbazar, Hyderabad.

**Smt. D. V. Madhavi**
Vasa Nilayam
Malakpet, Hyderabad - 500 036.

**Navodaya Book House,**
Opp Aryasamaj Mandir,
Kachiguda Cross Road,
Sultanbazar, Hyderabad.

*Type Setting & Printing*

*Ajay Prints*
Nallakunta, Hyd - 44.
**Phone : 766 33 00**

# నామాట

భారతస్వాతంత్ర్యసమరాంగణంలో ప్రాణాలకు తెగించి మడులు, మాన్యాలు వదులుకుని, సర్వంత్యాగంచేసి పోరాడిన నారీమణులెందరో! నిర్వార్థసేవా తత్పరులెందరో! వారి త్యాగఫలితమే ఈ స్వతంత్రభారతం.

మానాన్నగారు భారత స్వాతంత్ర్యోద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు. విదేశీవస్త్రదహనాలు చేశారు. ఖాదీ వస్త్రాలు తాను ధరించి ఇతరులచేత ధరింపచేశారు. కారాగారాలకు వెళ్ళారు. స్వరాజ్యం రాకమునుపే నేను జన్మించినా మరీ చిన్నతనం మూలంగా ఉద్యమంలో పాల్గొనే అవకాశం లేకపోయినా ఆసంగతులు వింటున్నప్పడు నాలో గూడుకట్టుకున్న ఉత్సాహమే నా ఊపిరిలో ఊపిరిగా నిలిచింది. నేను పుట్టినప్పడు జయప్రకాష్ నారాయణ దంపతులు మా ఆత్రేయపుర గ్రామానికి రావడం జరిగింది. మాయింట్లోనే వారికి ఆతిథ్యం ఏర్పాటు చేశారు. జయప్రకాష్ నారాయణ గారి భార్య ప్రభావతీదేవి పేరే నాకు మానాన్నగారు నామకరం చేశారు. అందువల్లనేమో నాకు దేశభక్తులంటే మరింత అభిమానం.

మాయింట్లో వీధి గుమ్మానికి ఎదురుగా సావిట్లో గాంధీ, నెహ్రూ, రాజేంద్రప్రసాద్, సరోజినీనాయుడు, పట్టాభి సీతారామయ్య మొదలైన వారి ఫోటోలు వుండేవి. దేవుని ఫోటోలకంటే మానాన్నగారికి అవే ముఖ్యం.

ఆగ్రామంలో గ్రామ పెద్దలందరూ కలిసి హైస్కూలు పెట్టించారు. లైబ్రరి ఏర్పాటు చేసారు. అందులో మానాన్నగారు కాశీచయనుల సూర్యనారాయణగారు, మాచిన్నాన్నగారు కాశీచయనుల సుబ్రహ్మణ్యంగారు ప్రధానపాత్ర వహించారు. అందుకే మేము (ఆడపిల్లలం) చదువుకోగలిగాం. లేకపోతే నేను కూడా అందరి ఆడపిల్లల్లాగే 5 వక్లాసుతో మానేదాన్నేమో!

ఆ మహాత్మగాంధీ హైస్కూల్లో చదువుకునేటప్పడు తరచు కొందరు నాయకులు, పెద్దలు ఆగ్రామానికో, ఆస్కూలుకో వస్తుండేవారు. వారిలో కళా వెంకట్రావుగారు ఒకరు. నేను చురుగ్గా చదువుతూ మంచి మార్కులు తెచ్చుకోవడం వల్ల చాలా మంది నన్ను అభిమానించేవారు. కళా వెంకట్రావుగారు నన్ను చూసినప్పడల్లా "దుర్గాబాయమ్మగారి దగ్గరకు పంపిస్తాము. పెద్ద చదువులు చదువుకుందువుగాని" అని అనేవారు. అందుకే చదువుకోవాలనే పట్టుదల నాలో పెరిగింది.

ఆగ్రామానికి ఎవరు పెద్దలు వచ్చినా నాపాత్ర వుండేది. వారికి స్వాగతం పలుకుతూ దేశభక్తిగీతాలు పాడటానికో, హారతి ఇవ్వడానికో నన్ను తీసుకువెళ్ళేవారు. ఆగ్రామానికి వచ్చిన పెద్దలలో జయప్రకాష్ నారాయణ దంపతులు, వినోభాభావే, విశ్వనాథసత్యనారాయణగారు, శ్రీపాదవారు. వారి ప్రక్కన నిలబడి వారికి హారతిచ్చి, జాతీయ గీతం పాడే అవకాశాలు నాకు కలిగాయి.

అంతేకాకుండా మానాన్నగారివెంట ఎన్నికలలో ప్రచారానికి నేను, మా చిన్నాన్నగారి అమ్మాయి వెళ్ళేవారం. ఆడపిల్లలు బయటకురాని ఆగ్రామంలో మాకు అటువంటి అవకాశం కలిగింది. అందుమూలంగానే దేశనాయకులమీద చెప్పలేని అభిమానం ఏర్పడింది.

ఝాన్సీలక్ష్మిబాయి చరిత్ర చదువుతుంటే ఒళ్ళు జలదరించేది. సరోజినీనాయుడు, విజయలక్ష్మి పండిట్, దుర్గాబాయిదేశముఖ్ మొదలగు వారి చరిత్రలు నన్నెంతగానో ఆకర్షించేవి. అనుకోకుండా

స్వాతంత్ర్యోద్యమంలో మహిళల పాత్రమీద వ్యాసం రాయటం జరిగింది. అదే ఈ ముగ్గుర్ని గురించి రాయడానికి నాంది అయింది.

సారా నిషేధ ఉద్యమంలో భాగంగా శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మిగారితోపాటు మహబూబ్‌నగర్ వెళ్ళి ఉపన్యసించే అవకాశం కలిగింది. ఆనాడు స్వాతంత్ర్యోద్యమంలో ఆవిడ అనుభవాన్ని గురించి చెబుతుంటే ఎంతో ఉత్సాహంగా విన్నాను. సమయం చాలక ఇన్నాళ్ళు ఆలస్యమయింది. ఈనాడు ఆవిడ దగ్గరకు వెళ్ళి మరిన్ని విషయాలు తెలుసుకొని మీ ముందుంచుతున్నాను.

ఇందులో మరొకరు నాస్నేహితురాలు సత్యవతి మాతృమూర్తి శ్రీమతి పసల అంజిలక్ష్మిగారు. ఆవిడను గురించి విని ఆవిడను కలుసుకొని ఆ విషయాలు ఇందులో రాసాను.

మావూరులో నాక్లాసుమేట్ ఇందుకూరి సూర్యనారాయణరాజుగారు ఉద్దరాజు మాణిక్యాంబగారిని పరిచయం చేశారు. ఆవిడ కంఠం విప్పితే అలా పాడుతూనే వుంటారు. మహాత్మాగాంధీ వంటి దేశనాయకులు ఆవిడకంటి ముందు ఇంకా తిరుగుతూనే వుంటారు. ఆ ఉద్యమ గీతాలు ఆనోటిలో మ్రోగుతూనే వుంటాయి. వయసును మరిపించే ఉత్సాహం ఆమెది. ఆవిడ చెప్పిన కొన్ని విషయాలు ఇందులో పొందుపరిచాను.

ఇది ఆముగ్గురు మహిళామణుల సమగ్ర చరిత్ర కాకపోవచ్చును. పెద్ద చదువులు లేకపోయినా పల్లెలలో పుట్టిపెరిగిన ఆ స్త్రీలలోని చురుకుదనము, ధైర్యసాహసాలు ఈనాటి స్త్రీలకు నిజంగా ఆదర్శమే.

ఈనాడు రోడ్డు రోమియోలకు చదువుకున్నవారు, చదువుకోనివారు, ఉద్యోగాలు చేస్తున్నవారుకూడా భయపడి పారిపోతున్నారు. ఆనాడు ఈ నారీమణులు పరాయిసైన్యపు తుపాకీలకు ఎదురీది నిలబడ్డారు. ఇళ్ళను, వాకిళ్ళను, గోషాలను వదలి మగవారితో సమానంగా ఉద్యమాలు నడిపించి జైళ్ళకు వెళ్ళారు. జైలు జీవితమే సుఖమయమని పాటలు పాడుకున్నారు. ఈనాడు ఇంకా అత్తతిడితే ఏడ్చేవారు, భర్త కొడితే ఆత్మహత్యలు చేసుకునేవారు ఎందరో వున్నారు. వారందరూ ఇలాటివారి చరిత్రలు చదవాలి. దౌర్జన్యాలు, దోపిడీలు ఆపాలి అంటే స్త్రీలలో చైతన్యం రావాలి. వారిలో వుండే ఐఖ్యతే ఆనాడు వారికి బలమైంది. ఈనాడు స్త్రీలలో ఐఖ్యత లోపమనే చెప్పాలి. పక్కింట్లో భర్త, భార్యను కొడుతుంటే మనకెందుకనుకుంటున్నారు. అత్తమామలు కిరసనాయిలుపోసి తగలపెడుతుంటే తలుపులు వేసుకుంటున్నారు. ఈ వరకట్నపు బాధలు – చావులు ఆడువారందరూ ఏకమై ముందునిలబడితే ఎప్పుడో నశించి పోయేవి. అబలలమనికాదు సబలలమనిపించుకుంటే ఏనాడో ఈ రేపులు రూపుమాసి వుండేవి.

గతం వర్తమానానికి నాంది అవుతుంది. అందుకే ఈ ముగ్గురు నిస్వార్థసేవామూర్తుల చరిత్రలు చదవాలని, తప్పక చదువుతారని ఆశిస్తున్నాను. స్త్రీలోకంలో మరింత చైతన్యం రావాలని కోరుకుంటున్నాను.

భారతస్వాతంత్ర్య చరిత్రను ఎందరో మహానుభావులు రచించారు. అందుకే మళ్ళీ నేను ఆ చరిత్రను రాయటం లేదు.

ఎందరో స్త్రీలు ఆనాడు సంగ్రామంలో సమిధలైన తరువాత ఫలితాన్ని ప్రజలందరూ అందుకున్నారు. కాని ఈనాటి దేశపరిస్థితి ఆనాటి నాయకులకే రోతపుట్టిస్తోంది. ఈ పరిస్థితి చక్కబడాలంటే స్త్రీలందరూ ఒక ఉద్యమంగా పనిచేయవలసి వుంది. అడుగడుగునా పరుచుకుని వున్న కుళ్ళును కడిగివేయవలసివుంది.

రచయిత్రి

# భారతస్వాతంత్ర్యపోరాటం

''జననీజన్మభూమిమశ్చ స్వర్గాదపి గరీయసీ'' అన్నారు పెద్దలు. ఆజన్మభూమి పరాయిపాలకుల సంకెళ్ళలో స్వేచ్ఛను కోల్పోయి దానిపై రక్తపుకన్నీరు కారుస్తుంటే నిద్రాణమైన భారతజాతి మేల్కొని జూలుదులిపింది. బాధాతప్తజీవులైన భారతీయులంతా సంఘటితమై తమబాధలు తమఅవమానాలు మరచి ముందుకొచ్చారు. పరాయిపాలకుల చేతుల్లో అష్టకష్టాలు పడ్డారు. దేశమాత స్వేచ్ఛకోసం రక్తతర్పణం చేశారు. ప్రాణాలు ఫణంగా పెట్టారు.

1957 నాటి విప్లవ తిరుగుబాటు ఝాన్సీలక్ష్మీబాయి వీరోచితపోరాటం జనుల వెన్నుతట్టి ముందుకు నడిపింది. ప్రజలలో దేశాభిమానం పెల్లుబికి వచ్చింది. ఉప్పెనలా పొంగి పొరలింది.

''స్వరాజ్యం నా జన్మహక్కు'' అన్న లోకమాన్య బాలగంగాధర తిలక్ నినాదం దేశ నినాదమై మారుమ్రోగింది. బంకించంద్ర ''వందేమాతరం'' గీతం ఆలపిస్తే యావత్ భారతం గొంతు కలిపింది.

గోచికట్టి గాంధీ అహింసావాదియై ఉద్యమాలు నడిపిస్తే యావత్ భారతం ఆయన వెంట నడిచి పరాయిపాలకులను గడగడలాడించింది.

భారతీయుల అవిరళ కృషి ఫలితంగా ఎర్రకోటపై పరాయిజండా క్రిందకు రాలింది. త్రివర్ణపతాకం విశాల విను వీధిలో రెపరెపలాడింది.

ఈమహత్తర సమర యాగంలో నాయకులతోపాటు, కవులు, గాయకులు మరెందరో చేతులు కలిపారు. పురుషులతోపాటు ఎందరో స్త్రీలు ఈ యాగ దీక్షలో సమిధలయ్యారు. ఈ మహోన్నత ప్రజాపోరాట విజయం ఈ స్వరాజ్యం. భారతభూమి స్వతంత్ర్య దేశంగా వెలసింది. మనమందరం స్వతంత్ర పౌరులమయ్యాం.

# స్వాతంత్ర్యోద్యమంలో స్త్రీలు



వేదకాలం నుండి ఆధునిక కాలం వరకు-భారతీయ మహిళలు సమాజంలో ప్రాధాన్యతను, బాధ్యతను కలిగివున్నారనడం అతిశయోక్తి కాదు. భారతీయ సమాజం స్త్రీని దేవతగా, మాతృమూర్తిగా, సోదరీమణిగా ముద్దుల తనయగా, గృహిణిగా, అత్తింటి కోడలుగా తగిన ఆదరణ చూపి గౌరవించింది. స్త్రీ త్యాగమూర్తిగా, వినయవతిగా, విద్యావతిగా, ఆధ్యాత్మశీలిగా, వీరవనితగా నిలిచి ఆదరణను, ఆత్మీయతను, అనురాగాన్ని సమాజానికి పంచి ప్రపంచ మహిళలకే ఆదర్శంగా నిలిచింది.

స్త్రీలందరూ అంత ఉన్నత స్థితిలో వున్నారంటే అందరూ వున్నారని కాదు! ఒకతరానికి ఒక స్త్రీ రత్నము ఉదయించిన అది స్త్రీ జాతికి గర్వకారణమే కదా! ఆ స్త్రీని ఆదర్శంగా తీసుకుని మిగిలినవారు ఆ స్థితికి చేరాలన్నదే ధ్యేయం.

పురుషవేషం ధరించి ఓరుగల్లును పరిపాలించిన రాణీ రుద్రమదేవి స్త్రీ జాతికే గర్వకారణం. భరతావనికే మణిహారం.

అంతటి శక్తి సామర్థ్యాలు కలిగిన భారతీయ మహిళలు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని తమలో దాగున్న శక్తిసామర్థ్యాలను సమాజంలో నిరూపించుకున్నారు.

మహాత్మాగాంధీ పిలుపునందుకుని కులమత భేదాలు వదలి, బీద ధనిక భేదాలు లేక స్వార్థాన్ని పక్కకు నెట్టి త్యాగశీలలై కొండంత హృదయంతో

జాతీయోద్యమంలో ప్రధానపాత్రను వహించి భరతమాత దాస్యశృంఖలాలను పగులకొట్టిన ఘనత మహిళలకు తక్కింది. ''జననీ జన్మభూమిశ్చ స్వర్గాతపి గరీయసీ'' అన్న సత్యాన్ని నిరూపించారు భారతీయ మహిళలు.

ఎండకన్నెరుగని సంపన్న గృహిణులు, వీధిగడపతొక్కని గృహిణులు, రాజకీయ పరిజ్ఞానములేని వనితలు, చదువుసంధ్యలు లేనివారు, అక్షరం ముక్క నేర్వని. ఆడువారు ఎందరో స్వాతంత్ర్యోద్యమాన్ని జయప్రదం చేశారు.

ధరించిన నగలను మహాత్ముని వడిలో గుమ్మరించి బోసిమెడలతో కదలినవారు, పవిత్రమైన మంగళసూత్రాలను కూడా ఉద్యమానికి సమర్పించి పసుపుతాడు ధరించినవారు, సర్వం గాంధీజీకి సమర్పించి వట్టిచేతులతో నిలిచనవారు మరెందరో!

రాజకీయ రంగంలో చేరి పగలూ రాత్రీ తెలియక పనిచేసినవారు సన్నని వస్త్రాలను వదలి ముతుక ఖద్దరు కట్టిన ముద్దుగుమ్మలు, ఖద్దరు మూటలు నెత్తినపెట్టి యింటింటికీ తిరిగి ప్రచారం చేసినవారు, విదేశీ వస్త్రలను పోగుచేసి భోగిమంటలుగా పేర్చి కాల్చి ఆనందించినవారు, రాట్నాలు వడికి నూలు తీసిన మహిళలు మరెందరో!

యమకింకరులవంటి ఆంగ్ల సిపాయిలకు భయపడక, ఉప్పు సత్యాగ్రహం, నాన్‌కోపరేషన్ ఉద్యమం, స్వదేశీ ఉద్యమం, క్విట్ యిండియా ఉద్యమాలు, జయప్రదం చేసి జైలుకు వెళ్ళినవారు, ప్రాణాలకు తెగించి ఆంగ్లేయ ప్రభుత్వాన్ని ఎదిరించినవారు, చంటిపిల్లలను చంకన యిడుకొని జైళ్ళకు నడచినవారు, లాఠీ దెబ్బలకోర్చి, తుపాకీ గుళ్ళకు భయపడక ఉద్యమాలు నడిపించి ఆంగ్ల ప్రభుత్వాన్ని గడగడలాడించిన మహిళలు ఎందరో!

పరాయిపాలకుల దుండగాలను చూసి సహించలేక, వారు పెట్టే బాధలు పడలేక, వారు చేసే అవమానాలు భరించలేక, చావగొట్టి చంపుతుంటే, ఉరి శిక్షలు వేస్తుంటే సహించ లేక, రైతు కూలీలను బండిఎద్దులుగ కట్టించి రథాలను, గుఱ్ఱపు బండ్లను తోలించె నాయకుల ఆగడాలు చూసి సహనం నశించిపోగా, ఆంగ్లపాలకుల దౌర్జన్యాలతో మహాద్భారతం రక్త పుటేరులై పారుతుంటే

గుండెచెదిరి పోగా, గాంధీ పిలుపు వేణునాదంలా వినబడితే ఆ పిలుపు వెంట నడిచారు ఆడువారు. స్త్రీ శక్తి స్వరూపిణి. త్యాగమూర్తి. ఓర్పు సహనానికి సహవాసి అని నిరూపించుకున్నారు.

1887లో జరిగిన మొదటి భారత స్వాతంత్ర్యసంగ్రామంలో వీరవనితయైన ఝాన్సీ లక్ష్మి బాయి పాత్ర కనివిని ఎరుగనిది. అసలు ఆమె తిరుగుబాటు వల్లనే ఆ సంగ్రామం జరిగిందని చెప్పవచ్చు.

ఝాన్సీ రాజైన గంగాధరరావు మరణా నంతరం అతను చేసుకున్న దత్తత చెల్లదని బ్రిటీషు వారు ఝాన్సీ కోటను ఆక్రమించుకొనగా లక్ష్మీబాయి ఆ అన్యాయం సహించలేక నిప్పులు కురిపించింది. కత్తి సాములో, గుఱ్ఱపు స్వారీ మొదలగు యుద్ధవిద్యలలో ఆరితేరి వున్న గంగాధరరావు భార్య. ఝాన్సీ లక్ష్మీబాయి సైన్యసమీరకణ చేసుకొని ఆంగ్లేయులపై పిరుగుబాటు చేసింది. బాలుణ్ణి వీపున కటుకొని వీరోచితంగా యుద్ధంచేసి ఆంగ్లేయులను గడ గడ లాడించింది. ఆటువంటి కారణం వల్లనే రాజ్యం కోల్పోయిన నానాసాహెబ్, మహావీరుడైన తాంతియాతోపీలు ఆమెకు సహకరించి బ్రిటీష్ వారిని ముప్పు తిప్పలు పెట్టారు. మరొక పక్క దేశాభిమానం గల ప్రజలు సహకరించారు. మందుగుండు సామానులు, మరఫిరంగులు, తుపాకులు వీరికి లేక పోయినను వీరోచితంగా పోరాడి బ్రిటీష్ పాలకుల గుండెల్లో చిచ్చురేపి వీరస్వర్గం అలంకరించిన నారీమణి ఝాన్సీ లక్ష్మీబాయి.

ఆనాడు స్వతంత్ర రాజ్యాలన్నీ ఏకమై ఝాన్సీ అక్ష్మీబాయిలా తిరుగుబాటు చేసి ఉంటే భారతదేశానికి స్వరాజ్యం ఎప్పుడో వచ్చి వుండేది. కానీ కొందరు భారతీయులే ఆంగ్లేయులకు సైన్య సహకారం చేసి లక్ష్మీబాయి ఓడిపోవడానికి కారణభూతులవడం విచారకరం.

ఆ కాలంలో మరో వీరవనిత ఒక సామాన్యురాలు అయినా తిరుగుబాటు దారులకు ఆమె గృహమే నిలయముగా నిలిపి కాన్పూరును ఆంగ్లేయులు ముట్టడించినప్పుడు నానాసాహెబ్ సైన్యంతో పాటు ఆంగ్లేయులతో వీరోచితంగా పోరాడి దేశం కోసం ప్రాణాలర్పించిన వీరనారి ఆమె.

అదేకాలంలో పేర్కొనదగిన మరో వీరనారీమణి హజరత్‌బేగమ్. అయోధ్యరాజ్యాన్ని బ్రిటిష్‌వారు ఆక్రమించుకొన్నప్పుడు నవాబు భార్యయైన హజరత్ బేగమ్ ఝాన్సీలక్ష్మిబాయి వలెనే తిరుగుబాటు చేసింది. నానాసాహెబ్ వంటి విప్లవీరులతో చేతులు కలిపింది. లక్నోపై బ్రిటిష్‌వారు దాడిచేసినప్పుడు స్వయంగా ఎదిరించి నిలబడింది. తరువాత అహ్మదుల్లా సైన్యసహకారంతో షాజన్‌పూర్ యుద్ధంలో పాల్గొని బ్రిటిష్ సైన్యాలను గడగడలాడించింది. 1858 నవంబరులో ఈస్టిండియా కంపెనీ పరిపాలన రద్దుచేస్తూ లండన్‌లోని బ్రిటిష్ పాలనకిందికి భారతదేశాన్ని తీసుకుంటూ చేసిన నిర్ణయాన్ని సవాలుచేసి ఎదిరించింది. పైగా కంపెనీవారు భారత సంస్థానాలకు చేసిన ద్రోహాన్ని దుయ్యబట్టింది. దానితో కక్షకట్టిన ఆంగ్లేయులు నాలుగువైపుల నుండి సైన్యాలను పంపి ఆమెను చంపటానికి వలలు పన్నితే నేపాలుకు తప్పించుకుపోయిన వీరనారీ మణి ఆమె.

ఈ విధంగా ఈ మొదటి భారత సంగ్రామంలో ఎందరో నారీమణుల వీరోచిత పాత్ర పేర్కొనదగినది.

రానురాను బ్రిటీష్‌వారి దౌర్జన్యాలు భారత ప్రజలపై పెరిగి పోయాయి. 1885లో కాంగ్రెస్ పార్టీ స్థాపించినను చెప్పుకోదగిన మార్పుకనబడక పోయినను క్రమంగా పుంజుకుంటూ వచ్చింది. కాంగ్రెస్ పార్టీలో ఏర్పడిన మితవాద, అతివాదులు మొదటి ప్రపంచ యుద్ధానంతరం ఏకమై పోరాటం సాగించారు. అప్పటికే కొన్ని పత్రికలు స్థాపించారు. మొదటి ప్రపంచయుద్ధంలో జరిగిన కొన్ని సంఘటనల వల్ల భారతీయులలో రాజకీయ చైతన్యం మరింత కలిగింది. 1919 లో జలియన్‌వాలాబాగ్ జరిగిన హత్యా కాండ నాయకులతో పాటు యావద్భారతీయులను కదిలించి వేసింది. చివరకు నాయకులంతా ఏకమై జాతీయోద్యమాన్ని నడిపించడం మొదలు పెట్టారు. ఆసేతు హిమాచల ప్రజలు ఏకమై ఉద్యమాలలో పాల్గొన్నారు. బ్రిటీష్‌వారిని ఎదిరించి ఎన్ని బాధలు పెట్టినా, లాఠీ ఛార్జీలు చేసినా, జైళ్ళకు పంపినా, సహించి పోరాటం సాగించారు. చివరకు 1947లో భారత దేశాన్ని వదిలి బ్రిటీష్‌వారు పారిపోయారు. భారత్



మతకలహాలతో అట్టుడుకుతున్న నౌఖాలీకి కాలినడకన సాగుతున్న గాంధీజీకి ముందు సాగుతున్న వీరవనితలు

స్వతంత్రభారతమై వెలిగింది.

ఈ స్వతంత్ర పోరాటంలో ఎందరో మహి  : పాల్గొన్నారు. స్త్రీ పురుష భేదం లేకుండా పనిచేశారు. ఇది శాంతి పోరాటం. ఆయుధాలు లేవు. అహింస పునాదులపైన నడిచిన పోరాటమిది. దేశభక్తి, త్యాగం, అహింస ఇందు ఆయుధాలు. జాతి సమైక్యత పెట్టుబడి. ''ఐకమత్యమే బలం'' అన్న సూర్తి యదార్థమైన పోరాటమిది.

స్త్రీలలో అంతటి చైతన్యం రావడానికి ఆ రోజులలో అనేక కారణాలున్నాయి.

1. ఆంగ్లపాలకుల దుండగాలు, దౌర్జన్యాలు, అన్యాయాలు, అక్రమాలు.
2. కరువు, కాటకాలు, ఆర్థిక యిబ్బందులు.
3. అప్పటికే రాజారామమోహన్ వంటి వారు సతీసహగమనం వంటి దురాచారాలు ఎదురించి స్త్రీచైతన్యానికి పాటుబడుట.
4. వీరేశలింగంపంతులు వంటివారు వితంతు వివాహాన్ని, బాల్య వివాహాన్ని ఎదురించి స్త్రీ విద్యను ప్రోత్సహించుట.
5. స్త్రీలకు ప్రత్యేక సంస్థలు స్థాపింపబడుట.
6. గాంధీమహాత్ముడు స్త్రీలకిచ్చిన ప్రత్యేకత, స్త్రీచైతన్యానికి చేసిన సేవ, ఉపన్యాసాలు, సమాజంలో వారి బాధ్యతను తెలియచెప్పుట.
7. స్త్రీలలో ఉద్యమాలపై గలిగిన నమ్మకం. వారిలో దేశసేవకు కలిగిన నూతనోత్సాహం.

8. కొందరి భర్తలు, కొందరి తండ్రులు, కొందరి సోదరులు, కొందరి బంధువులు ఉద్యమాలలో పాల్గొనుట.

పై కారణాలవల్ల కొంత వరకు స్త్రీలలో నూతన చైతన్య కలిగిందని చెప్పవచ్చు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న స్త్రీలను 2 రకలుగా విభజింపవచ్చు.

1. జాతీయోద్యమంలో గాంధీ, నెహ్రూ మొదలగు నాయకుల వెంటనుండి ఉద్యమం నడిపించినవారు.

2. గాంధీ పిలుపునందుకుని (నాయకుల పిలుపునందుకుని) తమ తమ ప్రాంతాలలో ఉద్యమం నడిపించినవారు.

1. గాంధీ నెహ్రూ మొదలగు నాయకులతో పనిచేసి పోరాటం సాగించినవారిలో కస్తూరిబాగాంధీ, సరోజినీ నాయుడు, రాజకుమారి అమృత్‌కౌర్, దుర్గాబాయి, విజలక్ష్మి పండిట్, స్వరూపరాణి మొదలగు స్త్రీలు పేర్కొనదగినవారు.

విదేశీ వస్త్ర బహిష్కరణోద్యమంలో నాయకులంతా జైళ్లపాలైనప్పుడు శ్రీమతి దుర్గాబాయి, అవంతికాబాయ్ గోఖలే, రాజకుమారి అమృతకౌర్, సరోజినీనాయుడు, సుశీలానయ్యర్, లీలావతీమున్షీ, కమలాబాయి చటోపాధ్యాయవంటి నారీమణులు సత్యాగ్రహాలను నడిపించి పరాయి ప్రభుత్వాన్ని గడగడ లాడించారు. భారతీయులను ఆశ్చర్య చకితుల్ని చేస్తారు.

వీరిలో కస్తూరిబాగాంధీ పాత్ర నారీమణులకే ఆదర్శం. గాంధీ ఆశ్రమం ఈవిడవల్లనే ఆడువారితో నిండిపోయింది. నూలువడకడంలో ముదుక ఖద్దరు ధరించడంలో, ఉప్పు సత్యాగ్రహంలో ఎందరో స్త్రీలను తనవెంట నడిపించి విజయానికి కారణభూతురాలయింది. ధనవంతురాలైన నెహ్రూను కన్న తల్లి స్వరూపరాణి ఈవిడతో ఉద్యమంలో పాల్గొన్న నారీమణి. క్విట్ ఇండియా ఉద్యమంలో కారాగారంలో మరణించి యావత్ భారతీయులకు ఆదర్శంగా నిలిచిన మహిళ ఈమే.

సరోజినీనాయుడు గాంధి వెంట ఉద్యమాంలో నడిచి ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీకి అధ్యక్షురాలై రాజకీయ రంగంలో ఆడువారికే ఆదర్శంగా నిలిచింది. ''జాతి గులాబీ''గా పేరుగాంచి అనేక సార్లు జైలుకు వెళ్ళి ఆంగ్ల

సిపాయిలను ఎదిరించి భయాన్ని రేపింది. జాతీయ నాయకురాలిగా పేరుగడించి పనిచేసింది.

దుర్గాబాయమ్మగారు కూడా ఆ కోవకు చెందిన స్త్రీ. 12వ ఏటనే గాంధీ పిలుపునందుకుని ముదుక ఖద్దరు ధరించి ఇతర స్త్రీలచేత ధరింపచేసింది. ఆంధ్రప్రాంతంలోనే కాక మద్రాసులో, ఢిల్లీలో కృషిచేసిన వనిత ఈమె. మద్రాసులో హిందీ పాఠాలు నేర్పాడానికి స్కూలు స్థాపించింది. 1930 ఉప్పు సత్యాగ్రహంలో తాను పాల్గొనడమే కాక ఎందరో స్త్రీలను ముందుకు నడిపించింది. మహాత్మాగాంధీ ఆంధ్రదేశ పర్యటనకు వచ్చినప్పుడు ధనము వసూలు చేసి యిచ్చింది. ప్రతి ఉద్యమంలోనూ ఈమె పాత్ర యితర స్త్రీలకు ఆదర్శం.

2. గాంధీజీ పిలుపునందుకుని ఉద్యమాలు నడిపించిన వారిలో మద్రాసులో కమలాబాయి చటోపాధ్యాయ, ముత్తులక్ష్మి రెడ్డి, దుర్గాబాయి, ఆచంట రుక్మిణమ్మ ప్రధానులు.

తెలంగాణాలో విమలాబాయి మేల్కొటే, పద్మజానాయుడు. యల్లాప్రగడ సీతాకుమారి, సంగంలక్ష్మిబాయి, కలపకుంట్ల సరస్వతీదేవి, సుమిత్రాబాయి విద్యాదేవి ఓంప్రకాష్, సూర్యదేవర రాజ్యలక్ష్మి, జ్ఞానకుమారి హెడా మొదలగుస్త్రీల పాత్ర ప్రధానమైనది.

ఆంధ్రాప్రాంతంలో స్త్రీల పాత్ర మరింత ప్రధానమైనది. శ్రీమతి దుర్గాబాయి, చిలకమర్తి వారివేనకోడలు దువ్వూరి సుబ్బమ్మ, బత్తుల కామాక్షమ్మగారు, నాళం కృష్ణారావుగారి భార్య శ్రీమతి నాళం సుశీలమ్మగారు, ద్రోణంరాజులక్ష్మిబాయి, స్త్రీహితైషిణీ మండలి స్థాపకురాలైన కనుపర్తి వరలక్ష్మమ్మగారు, గుంటూరిలో శారదానికేతన్ స్థాపించిన ఉన్నవలక్ష్మిబాయమ్మ, బసవరాజు అప్పారావుగారి సతీమణి బసవరాజి రాజ్యలక్ష్మి, దూళ్ళ వెంకట రమణమ్మ, పులవర్తి కమలావతీదేవీ, కోడూరి లీలావతమ్మ రామసుబ్బమ్మ, దేవులపల్లి సత్యవతమ్మ, కొండా వెంకటప్పయ్య పంతులుగారి [illegible] కొండా పార్వతి, పసల అంజలక్ష్మి, పొనకా కనకమ్మ. శ్రీమతి మాగంటి అన్నపూర్ణమ్మ, బాలాత్రిపురసుందరి ఉద్దరాజు మాణిక్యాంబ మొదలగు నారీమణులు

మరెందరో పేర్కొనదగినవారున్నారు.

సరోజినీదేవి వంటివారు మహాత్మాగాంధీ వెంట అనేక ప్రాంతాలు సందర్శించి ఉపన్యాసాలు చేశారు.

మద్రాసులో రౌలట్ చట్టాన్ని వ్యతిరేకిస్తూ ఆవిడ చేసిన ఉపన్యాసం ఎందరినో ఆకర్షించింది.

ఆంధ్రదేశంలో మహాత్మాగాంధీ పర్యటనకు వచ్చినప్పుడు విజయవాడ సభలో ఎన్నో తీర్మానాలు చేశారు. ప్రకాశం పంతులు, పట్టాభి సాంబమూర్తి మొదలగు వారితో పనిచేసిన దువ్వూరి సుబ్బమ్మగారి పాత్ర పేర్కొనదగినది. ఖద్దరు మూటను నెత్తిన పెట్టి వాడవాడలా తిరిగి స్త్రీలను కట్టమని ప్రోత్సహించడమే కాకుండా ఎన్నో సార్లు జైలుకు వెళ్ళి లాఠీ దెబ్బలు తిన్న మహిళ ఈమె. మద్యపాన వ్యతిరేకోద్యమంలో పొనకా కనకమ్మ పాత్ర పేర్కొనదగినది.

మహాత్ముని ఆంధ్రదేశపర్యటనలో తిలక్ స్వరాజ్యనిధికి మాగంటి బాపినీడుగారు సతీమణి అన్నపూర్ణమ్మగారు తన నగలన్నింటిని గాంధీకి సమర్పించి ఖద్దరు కడతానని ప్రతినబూనింది. ఈ సందర్భంలో ఒక వేశ్య పాత్ర పేర్కొనదగినది. యానిసీపూర్ణ తిలకనునే వేశ్య తన వృత్తిని వదిలి సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని దేశ స్వాతంత్ర్య సముపార్జనకు జీవితం అంకితం చేసింది.

ఆంధ్రదేశంలో స్త్రీలు ఉప్పు సత్యాగ్రహకాలంలో కొత్త పద్ధతులు ప్రవేశ పెట్టారు. ''స్వరాజ్యలక్ష్మీపూజ'' పేరిట ఇంటింటికి తిరిగి ఉగాదినాడు పూజలు జరిపి స్త్రీలకు పిలుపునిచ్చుటలో ఉన్నవ లక్ష్మీబాయమ్మ, రుక్మిణీ లక్ష్మీపతి మొదలగు స్త్రీలు పేర్కొనదగినవారు.

నెల్లూరు జిల్లాలో జరిగిన ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్న మొదటి మహిళ పాతూరి బాలసరస్వతమ్మ, ఆమె కుమార్తె, మద్రాసులో జరిగిన ఉప్పు సత్యాగ్రహంలో శ్రీమతి దుర్గాబాయమ్మ, ప్రకాశం పంతులుగారి భార్య పేర్కొనదగినవారు. వొల్లింగిలో జరిగిన ఉప్పు సత్యాగ్రహంలో 500 మంది స్త్రీలు పాల్గొన్నారు.

విదేశీ వస్త్ర దుకాణాలముందు పికెటింగ్ జరిపిన నారీమణులలో దిగుమర్తి బుచ్చికృష్ణమ్మ,గాడిచర్ల శేషాబాయి, పాలకోడేటి శ్యామలాంబ మొదలగు స్త్రీలు ఉన్నారు.

1932 శాసనోల్లంఘనోద్యమంలో గుడివాడలో వల్లభనేని సీతామహాలక్ష్మి నాయకత్వం వహించగా దిగుమర్తి జానకమ్మ, చుక్కామ్మ వేదంతం కమలాదేవి, కంభంపాటి మాణిక్యాంబ మొదలగు వారు 144 సెక్షన్ ధిక్కరించి పికెటింగ్ చేసి సంవత్సరం జైలు శిక్ష అనుభవించారు. మాణిక్యాంబగారు ఆరుమాసాల పసిబిడ్డనెత్తుకుని జైలుకు వెళ్ళారు. కొందరు మహిళా ప్రదర్శకులపై రంగునీళ్ళు, బురదనీళ్ళు జల్లి ఉక్కిరి బిక్కిరి చేస్తారు.

జైళ్ళలోని దారుణ పరిస్థితికి వ్యతిరేకంగా జరిపిన ఉద్యమంలో భారతీదేవిరంగా రేపల్లె, తెనాలి, కోవూరు మొదలగు ప్రాంతాలలో ప్రచారం చేసినందుకు సంవత్సరం జైలు శిక్ష, 500 రూపాయలు జరిమానా విధించారు.

గుంటూరులో జరిగిన రహస్య రాజకీయ సభకు వేదాంతం కమలమ్మ అధ్యక్షత వహించగా, మరోసభకు ప్రగడ విశ్వసుందరమ్మ, భీమవరం సభకు లావు అంకమ్మ, బాపట్లలో కంభంపాటి మాణిక్యాంబ తెనాలిలో టేకుమళ్ళ అచ్యుతమ్మ. కైలాసపట్టంలో భవనం తిరుమలమ్మ ఆధ్యక్షత వహించగా అరెస్టు చేసి అధికారులు జైళ్ళకు పంపారు.

మద్రాసులో జరిగిన ఉప్పు సత్యాగ్రహంలో స్త్రీల పాత్ర ప్రధానమైంది. ప్రకాశం పంతులుగారితోపాటు దుర్గాబాయమ్మగారు, శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతి పేర్కొనదగినవారు. శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతిగారు ఉరంతా తిరిగి ఉద్బోధన చేయగా 20 మంది స్త్రీలతో హైకోర్టు బీచ్ ముందు దుర్గాబాయమ్మగారు ఉప్పు తయారుచేసారు. తరువాత మైలాపూర్‌లోని శాంతోమ్ బీచ్‌లో 9 మంది స్త్రీలతో ఉప్పుచేసససఎస్తుండగా పోలీసులు తరిమికొట్టారు. మద్రాసులో ''వేదారణ్యం'' శిబిరంవద్ద కాపలా పెట్టబడిన రిజర్వు పోలీసులను ఆంగ్లేయులపై తిరగబడమని శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి కరపత్రాలు పంచి పెట్టడం స్త్రీల సాహసానికి నిదర్శనం.

కేరళ, మైసూరు, మహారాష్ట్ర మొదలగు ప్రాంతాలలో కూడా ఎందరో స్త్రీలు సత్యాగ్రహాలలో పాల్గొని తమ శక్తి సామర్థ్యాలు ప్రకటించారు.

ఈ సమయంలో తెలంగాణా ప్రాంతంలో జరిగిన ఉద్యమాన్ని పేర్కొనక తప్పదు. ఒకపక్క నైజాం సర్కారును ఎదిరిస్తూ మరోపక్క ఆంగ్లేయపాలనను అంతం చెయ్యడానికి చేసిన కృషి పేర్కొనదగినది. అక్కడ కూడా స్త్రీల పాత్ర ప్రాధాన్యతను సంతరించుకుంది.

నైజాం నవాబు ఎన్నికట్టుదిట్టాలు చేసినా గాంధీజీ ప్రభావాన్ని ఆపలేకపోయారు. ఖద్దరుధారణ, ఇళ్ళలో నూలువడకడం మొదలగు వాటికి ప్రాధాన్యత కలిగింది. ఆర్.వి.పిళ్ళై వితంతు సోదరి చర్కా పైనూలు వడికేఫ్యాక్టరీ స్థాపించింది. పద్మజా నాయుడు వంటివారు ఖద్దరు ఉద్మాన్ని వ్యాపింపచేశారు. ఈ కాలంలో ఆంధ్రజనసంఘం మహిళా విద్యావ్యాప్తికై ఆంధ్రబాలికోన్నత పాఠశాలను స్థాపించారు.

ఇక్కడ జరిగిన క్విట్ ఇండియా ఉద్యమంలో విమలాబాయి మేల్కోటె, పద్మజానాయుడు, మొదలగువారు నరేంద్రజీ, కోదాటి నారాయణరావు, వందేమాతరం రామచంద్రరావు మొదలగు వారితో పాల్గొని అరెస్టు అయ్యారు.

కాంగ్రెసు తరపునేకాక మహారాష్ట్ర పరిషత్తు, కర్నాటక మహాసభలవంటి సంస్థల తరపున కూడా అనేకమంది సత్యాగ్రహాలు చేసి అరెస్టు అయ్యారు. రెసిడెన్సీ భవనం పై జాతీయపతాకం ఎగురవేసి పద్మజానాయుడు అరెస్టు అయ్యారు. కమలాదేవి చటోపాధ్యాయ ఈ ప్రంతానికి వచ్చి ఎంతో కృషిచేసింది.

నైజాం కర్కశ రక్కసులను తప్పించుకుని అరుణా అసఫ్ అలీ తెలంగాణా ప్రాంతంలో స్వయంగా సోషలిస్టు పార్టీకి ఒక కార్యాచరణ సంఘాన్ని నియమించింది.

తరువాత ఇండియన్ యూనియన్‌లో హైదరాబాద్ చేర్చాలన్న ఉద్యమంలో కూడా విమలాబాయి మేల్కోటె, కమలమ్మ, అహల్యాబాయి, సుమిత్రబాయి, లక్ష్మి, రాజేశ్వరి మొదలగు స్త్రీల పాత్ర ప్రధానమైనది.

ఈ సమయంలో బెంగాల్ విప్లవ నారీమణులను గూర్చి చెప్పుకోక తప్పదు.

విప్లవనాయకులతో కలిసి పట్టభద్రులైన బీనాదత్ ఆంగ్ల గవర్నర్ చేసే దుండగాలు భరించలేక 1932 పిస్టలుతో కాల్చి గవర్నరును చంపివేసింది. ఈమె అక్క కళ్యాణి చిటగాంగ్ ఆ.యుధకర్మాగార ముట్టడిలో పనిచేసి అరెస్టు చేయబడిది. వీరిలో ప్రముఖురాలు కల్పనాదేవి. ఈమె విప్లవనాయకులతో చేరి చిటగాంగ్ ఆయుధ కర్మాగార ముట్టడిలో పని చేసి ప్రభుత్వాన్ని భయభ్రాంతులను చేసింది. ఈ సమయంలో 14 సం!! వయస్సుగల ఇలా, మీరా అను పేర్లుగల అక్క చెలెళ్ళు కలక్టరు ఇంటిముందు టాంగా దిగి ఆయనను ఈతపోటీలకు స్కూలుకు రమ్మని ఆహ్వానిస్తూనే కలక్టరును పిస్టల్‌తో కాల్చి చంపి అతను చేసే దౌర్జన్యాలకు స్వస్తి చెప్పారు.

ఈవిధంగా విప్లవ వాయకుల చరిత్రలో కూడా స్త్రీల పాత్ర పేర్కొనదగినది. భగత్‌సింగ్, అల్లూరి సీతారామరాజు వంటి విప్లవవీరులకోవకు చెందినవారు. వీరు.

ఈ ఉద్యమకాలంలో స్త్రీలు హక్కులను, అవకాశాలను పోరాటం సాగించి సాధించుకున్నారు. అందులో మొదటిది ఓటింగ్ హక్కు స్త్రీలకు ఓటింగ్ హక్కు రావడానికి కృషిచేసిన వారిలో శ్రీమంతి సరోజినీనాయుడు, మిస్‌హీరాలల్, ముఖ్యులు, మద్రాసులో కృషిచేసిన వారిలో శ్రీమతి కమలాదేవీ చటోపాధ్యాయ, శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డి, దుర్గాబాయి మొదలగు వారు ప్రధానులు. స్త్రీలు కూడా శాసన సభల్లో నిలబడి ఎన్నికయ్యే హక్కు తెచ్చుకున్నారు. ఈ కారణంవల్లనే శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిని మద్రాసు ప్రభుత్వం శాసన శభకు నామినేట్ చేసింది.

భారత దేశ చరిత్రలో మొదటిసారిగా శాసనసభలో అడుగు పెట్టిన మహిళ శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డి. స్త్రీలకొరకు పత్రికలు, సంస్థలు వెలువడ్డాయి. స్త్రీ విద్య ప్రోత్సహించబడింది. ఎందరో ఈ నాయకులు కృషిఫలితంగా భారతదేశానికి చీకటి సంకెళ్ళు వదలి స్వరాజ్యం సిద్ధించింది.



# భారత స్వాతంత్ర్యోద్యమానికి జీవితం అంకితం చేసిన ఆదర్శ నారీరణి

# సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి

కృష్ణా జిల్లా నందిగామా తాలూకాలోని వీరులపాడు చైతన్యానికి పెట్టింది పేరు. ఒక పక్క వీరేశలింగం పంతులు త్రిపుర నేని రామస్వామి చౌదరి, తాపీధర్మారావు వంటి మహానుభావులు సంఘ సంస్కార ద్రుష్టితో దురాచారాలను ఖండిస్తూ సాహిత్యం పండిస్తున్న రోజులవి. మరోపక్క మహాత్మాగాంధీ వంటి జాతినేతల న్యాయకత్వంతో భారతదేశమంతటా స్వరాజ్యసమరం ముమ్మరంగా సాగుతున్న రోజులవి. పరదాల వెనుక నున్న ఆడువారిని కూడా ప్రజా సమూహం మధ్యలోకి నడిపించిన రోజులవి. పురుషులతో సమానంగా మహిళలు ఉద్యమాలు నడిపించినరోజులవి.

పరదాల మధ్య ఒంటి నిండా బంగారు నగలుంపట్టు పావడా, జడ కుప్పెలతో మేడలలో ఎండకన్నెరుగక చిన్నరాణిలా తిరిగె 18సం. రాల యువతి పెద్దకమ్మవారి కుటుంబమర్యాదలను అధికమించి నడిరోడ్డులో కర్కశముష్కర, శ్వేత సైన్యాన్ని ఎదిరించి, ముతకపైనం గుడ్డలతో జైలు గోడల మధ్యలో జీవించడానికి కూడా వెనుకాడలేదంటే ఈనాడు నమ్మగలమా ? దేశభక్తి పొంగిపొర్లగా, కర్తవ్యమేలు కొలపగా కార్యదీక్షతో, దేశసేవ చేయ్యడానికి బీదధనిక భేధాలులేవని, కులమతాలు అడ్డురావని నిరూపించిన ఆమహోజ్జ్వల కాలంలో జన్మించిన వారంతా మహానుభావులే! ఆకాలంలో పుట్టి పెరిగిన వారంతా త్యాగమూర్తులే ? నిస్వార్థ సేవాతత్పరులే? 1914 మే 18న కృష్ణ జిల్లా నందిగామా తాలుకా వీరులపాడులో రాజ్యలక్ష్మిదేవి జన్మించారు. తండ్రి వాసిరెడ్డి సీతారామయ్యగారు పేరు మోసిన రైతులు. ఆకాలంలో ఆకుగ్రామంలో

ఆచంట్ల ప్రక్కల మిడిల్ స్కూలు వెలసింది. హనుమయ్య చౌదరిగారు మహాపండితులు.

అంతవరకు ఆడపిల్లలకు చదువులే లేవు. అప్పుడే ప్రారంభ కాలమిది. ఆయన గురుత్వంతో రాజ్యలక్ష్మి దేవి గారు చదువులో పాటు ఎన్నో విషయాలు నేర్చుకున్నరు.

గాంధీ గారి ప్రభావం వల్ల ఊరూర ఆడు వారు రాట్నాలు ఒడకడం ప్రారంభించారు. రాజ్యలక్ష్మి దేవి తల్లి, అక్కచెల్లెళ్ళతో పాటు రాత్రి పగలనక రాట్నం ఒడకడం చేసేవారు. పూవు పుట్టగానె తావి విరజిమ్ము నట్లుగా 17సం॥ల రాజ్యలక్ష్మిదేవి మనస్సు, భారత స్వాతంత్ర్యోద్యమం వైపు మళ్ళింది. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొంటానని పట్టు పట్టింది. జైల్లో చీకట్లో ఉంచుతారని, పగలు కూడా బయట తిరిగ నీయరని, తిండి పెట్టరని పైగా మైనారిటీ తీరనిదే సత్యాగ్రహం పనికిరాదని అన్నగారు చెప్పిన మాటలకు భయపడి ఆవిడ ఆ ప్రయత్నం విరమించుకున్నరు. కాని మనస్సు అటేలాగుతొంది.

అంతలో తెనాలి తాలుకా చేబ్రోలు వాస్తవ్యులైన శ్రీనాగయ్య గారితో వివాహమైన రాజ్యలక్ష్మి దేవి చేబ్రోలులో అడుగు పెట్టారు. చేబ్రోలు నాగరికతకు పెట్టింది పేరు. వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడుగారు కట్టించిన 101దేవాలయాలతో, చదువుకున్న సంపన్నులతో కలకలలాడేది. ఒక్కొక్క కులానికి ఒక్కొ బజారు పేరుతో పిలవబడేది. అది నేషనల్ హైవే. ప్రాంతీయ నాయకులే కాదు జాతీయ నాయకులు కూడా అక్కడ బసచేసేవారు.

అప్పటికే 40 మంది ఆడువారు జైలుకెళ్ళినవారు అక్కడ ఉండే వారు. ఒక పక్క పరదా పద్ధతితో గుఱ్ఱపు బండికి పరదాలు కట్టి ఆడువారు బయట అడుగు పెడుతుంటే మరో పక్క కొందరు ఆడువారు పరదాపద్ధతులు వదలి సత్యాగ్రహాలు చేసి జైళ్ళకు నడిచారు.

అక్కడ సాలిబజారు లో ఖాదీ ఎక్కువ నడికేవారు. అందవల్ల అందరు గాంధీ ఆదేశంతో ఖాదీ బట్టలు ధరించడం మొదలు పెట్టారు. వారితో రాజ్యలక్ష్మి దేవి కూడా ఖాదీ వస్త్రాలలే కట్టాలని దీక్షబూనారు.

18వ సంవత్సరంలో అడుగు పెట్టిన రాజ్యలక్ష్మి దేవికి అవకాశం వెతుక్కుంటూ వచ్చింది. పెద్దలు వద్దంటున్నా రాజ్యలక్ష్మి దేవితో పాటు తోటి

కోడలు రాజ్యలక్ష్మి, అక్కగారు అన్నపూర్ణ గారు 1932 జనవరి 26న శాసనోల్లంఘనం చెయ్యడానికి ముందు కొచ్చారు. అప్పటి 144 సెక్షన్ అమలులో ఉంది. ఈ ముగ్గురు ఆడువారు శాసనోల్లంఘనం చేస్తారని ముందే ప్రకటించడం వల్ల ఎంతోమంది ఆడమగ భేదంలేకుండా జనం చుట్టుపక్కల ఊళ్ళ నుంచి కూడా తరలి వచ్చారు. జాతీయ గీతాలు పాడుకుంటూ అందరు ఊరేగింపుగా బయలు దేరారు. పోలీసు ధిక్కార నేరం క్రింద అందరి మీద లాఠీ ఛార్జిచేసి ముగ్గుర్ని అరెస్టు చేసి అక్కడ సబ్ జైలు లేనందున పోలీసు స్టేషన్‌కి తీసుకు వెళ్ళారు. పైగా 50రూ॥ జరిమానా విధించారు. ముగ్గురు పెద్దింటి ఆడుబడుచులు. ఒంటి నిండా బంగారు నగలు, ఒడ్డాణం, ఒంకీలు, కాసుల పేర్లు, చంద్రహారాలు, పట్టెడ, జిడివంచ్చులు, నాగరం, గాజులు, మురుగులు వగైర నగలు ఎన్నో? ముగ్గురు కండువాలు పట్టగా ఆయువతులు వంటి మీద నగలు వలచి ఆ కండువాలలో వేసారట.

అదే రోజు సాయంకాలం ముగ్గుర్ని పొన్నూరు సబ్ జైలుకు పంపించారు. అది వంరీ చిన్న గది. ముగ్గురు ఆ గదిలో ఉండటమే కష్టం. మల మూత్రవిసర్జనలకు మూడు కుండలిచ్చారట, కుళ్ళుకంపుతో నరకం లాంటి ఆగదిలో 3 రోజులు వారు ఉండవలసి వచ్చింది. భోజనాలు మాత్రం ఇంటి నుంచి వచ్చేవి. మూడవ రోజు రాత్రి అర్ధరాత్రి అయినా ఆ జైల్లో లైట్లు వెలుగు తూనె ఉన్నాయిట. వచ్చిపోయే ఆఫీసర్లతో రహస్య ఆలోచనలతో జనం అటు ఇటు తిరుగుతుంటె ఆ ముగ్గురు సోదరీమణులు ఏమి చేయాలో తొచక కటకటాల దగ్గర కూర్చున్నరట. అంతలో అటుగా వెడుగున్న ఒక పోలీసుని పిలిచి కారణమడుగగా అతడు "మీకు C క్లాసు జైలులో 1 సం॥రం కఠిన కారాగార శిక్ష విధించారని "తెలియ చెప్పాడుట. ఆవార్త విన్న ఆ యువతులు ఏమాత్రం భయపడ లేదుట. పైగా మరింత మనోధైర్యంతో అలాగె కూర్చున్నారుట. ఆ రాత్రి ఇంటికి వెళ్ళిన మెజిస్ట్రేటును భార్య నిలదీసి అడిగిందిట, పెద్దింటి అమ్మాయిలను అలా శిక్షించవద్దని కఠిన శిక్ష రద్దు చెయ్యమని మాతృహృదయంతో భర్తకు నచ్చ చెప్పిందిట. పైగా అలా చెయ్యడం వల్ల వారు జైల్లో ఏపనినైన చెయ్య గలుగుతారని, కఠిన శిక్షలో ఏపని చెయ్యడానికి వీలు లేకపోడం వల్ల జైలు వారికే నష్టమని తెలియ చెప్పిందిట. భార్యమాటలు

మెజిస్ట్రేటు మీద రామబాణంలా పని చేసాయి. ఆయన వెంటనే మనసు మార్చుకుని మామూలు శిక్ష విధించి రాయ వెల్లూరు జైలుకు పంపించారు. అప్పటికే రాయవెల్లూరు జైల్లో దుర్గాబాయమ్మ గారు, తల్లి కృష్ణవేణమ్మగారు కూడా ఉండే వారుట. కృష్ణవేణమ్మగారు అందరి యోగక్షేమాలు చూడటమే కాదు అందరికి హిందీ పాఠాలు చెప్పేవారుట. జైల్లో భోజనాలు మాత్రం భయంకరంగా ఉండేవిట. అన్నం, పులుసు గంగాళాలను పెద్ద బొంగులకు కట్టి తీసుకు వచ్చే వారట, ముందగా ఇచ్చిన జర్మన్ సిల్వర్ కంచాలు పట్టుకుని క్యూలో అన్నం పెట్టించుకోవాలి. అలా ఆ చిప్పలు పట్టుకుని తిండి తెచ్చుకోడానికి మాత్రం వారి మనస్సులు బాధ పడాలిట. ఆ అవమానం పడటంకంటె తిండి లేకుండా మనుష్యులు బతక గలిగితే ఎంత బాగుండేదని వారు భావించేవారట. ఆ అన్నం ఊప్పుడు బియ్యంతో వండిన చలిమిడి ముద్ద. ఇక పులుసు తయారీ ఓ పెద్దకథ. పుచ్చిన కంపుకొట్టే నల్లని పాత చింత పండు. ముందు రోజు నాన పెట్టిన పుచ్చు కందులు పొట్టుతో రుబ్బి చెత్త, చెదారాలు, గట్టి ఆకులతో వండి ఒక తొట్టిలో పోసేవారు. ఆకలి చంపుకోడానికి పట్టెడు తినడం మిగిలినది వాంతులు రాగా తినలేక పారవేయడం జరిగేది.

జైల్లో రూల్సు ప్రకారం వెళ్ళాలని గాంధీ ఆదేశం. అందుకే ఎవరు పేచీలు పెట్టే వారు కాదు. హిందూ ధర్మశాస్త్రానికి విరుద్ధంగా ముండు జైల్లోకి వెళ్ళగానె ఆడువారు చేతి గాజులు పగుల గొట్టేవారు, అది మాధర్మానికి విరుద్ధమని అల్లర్లు చేయగా ప్లాస్టిక్‌గాజులు ఆడువారు చేతులకు ధరించడానికి అంగీకరించారు. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు జైల్లో ఉన్న ఆడువారందరికి ఆ ప్లాస్టిక్ గాజులు పంపించడం మొదలు పెట్టారు. పైగా కట్టుకోవడానికి అంచులు లేని మల్లుపంచలు పెద్దగా ఉన్న ఆ పంచెలు చింపి జాకెట్లు అక్కడే కుట్టుకుని తొడుక్కొనేవారు. జయంతి సుందరమ్మ గారు ( ధర్మతేజ తల్లి) వీరితోపాటె ఉండెవారు. జైల్లో ఉన్నందుకు దుఃఖం లేదు, బెంగ లేదు, పైగా పలు రకాల ఆటలతో, పాటలతో గడిపేవారు. పైగా చదువు నేర్చుకోడం, ఇతరులకు చదివి వినిపించడం చేసేవారు. వీళ్ళతో పాటు మదనపల్లి కాలేజీ ప్రిన్సిపాల్‌గారి భార్య కజిన్స్ సతి కూడా ఈ జైల్లోనె ఉండేవారు. ఆవిడకు తెలుగు రాదు, వీళ్ళకు

ఇంగ్లీషు రాదు, మాట్లాడుకోడం ఎలా? అది చాలా పెద్ద జైలు. ఆరోగ్యం పరీక్షించడానికి జైలు డ్క్టరు రాగా ఆయినను తన సమస్యలు చెప్పిందిట, ఆ డ్క్టరు నవ్వుతూ '' ఒక వస్తువును చూపించి '' ఏక్యాహై'' అని ''అడగమని సలహా ఇచ్చాడు.

ఆవిడ అలా ఒక వస్తువవవవును చూపిస్తూ '' ఏక్యాహై'' అని అడగడం వాళ్ళు తెలుగులో అదేమిటో చెప్పడం చెయ్యగా, ఆవిడ జైల్లో ఉండగానె మొత్తం భాషంతా చక్కగా నేర్చుకుందిట. ఆకులంలో స్త్రీల పట్టుదల మిగిలిన వారికి ఆదర్శమే కదా?

జైలునుంచి తిరిగి వచ్చిన తరువాత రాజ్యలక్ష్మీదేవి చేబ్రోల్లో స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయాన్ని స్థాపించారు దీనికి గొల్లి మూడి రత్నమ్మ గారు అధ్యక్షులు, ఈవిడ కార్యదర్శి ఈ కాలంలో ఖాదీ ప్రచారంతో పాటు హరిజనోద్ధరణ చేసేవారు. 1932లో తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని అరెస్టు అయ్యారు, సంవత్సరం జైలు శిక్ష, రూ.50 జరిమానా విధించారు.

1936 -37లో మద్రాసు ముఖ్యమంత్రి రాజ గోపాలాచారిగారు ఆంధ్రప్రాంతంలో జిల్లా బోర్డు ఎలక్షన్స్ జరిగాయి. త్రిపురనేని రాయి స్వామి చౌదరి గారిని ఓడించి రజ్యలక్ష్మి దేవి గెలుపొందారు. ఇంతకంటే స్త్రీలకు గర్వకారణం మరేముంటుంది?

1940 లో వ్యక్తి సత్యాగ్రహాలు ప్రారంభమయ్యాయి రెండవ ప్రపంచ యుద్ధానికి వ్యతిరేకంగా శాంతి యుతంగా వ్యక్తి సత్యాగ్రహాలు జరిగాలని గాంధీ గారు ఆదేశం. గుంటూరు జిల్లా నుండి రాజ్యలక్ష్మి దేవి ఎన్నికయ్యారు.

బాపట్ల తాలుకా బ్రాహ్మణ కోడురులో 1941 జనవరి 30న రాజ్యలక్ష్మి దేవి వ్యక్తి సత్యాగ్రహంచేసారు. ముందుగానె పోలీసులకు నోటీసు ఇచ్చారు. ఒక సర్కిల్ ఇనస్పెక్టరుకి మాత్రమే వారుని అరెస్టు చెయ్య డానికి అధికారముంది. అతని కింది వారెవ్వరు వారిని అరెస్టు చెయ్యడానికి వీలు లేదు.

ఆనాడు వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్న వ్యక్తి రాజ్యలక్ష్మీదేవి కి నుదుటికి తిలకం పెట్టారు. ఉద్యమగీతాలు పాడుకుంటూ ఎందరో వెంట నడిచారు. రాజ్యలక్ష్మి దేవిని అరేస్టు చేసి ఒంగోలు జైలుకు తీసుకు వెళ్ళారు. రాత్రి జైలు

మూసి ఉండి. కలెక్టరు వచ్చి రాయవెల్లురు జైలుకు తీసుకు వెళ్ళారు. ఆయినది ఉత్తర ప్రదేశ్. ఆయనే కాదు ఆయన కుటుంబీకులందరూ దేశ భక్తులే. ఆయన జైల్లో ఉన్న వారందరికి దేశ భక్తిని గూర్చి వివరించాడుట. మాత్ర దేశ భక్తిని డ్యూటీ నిర్భందించలేదు కదా !

మూడు రోజులు బి క్లాసు జైల్లో రాయవెల్లూరులో ఉంచారు. తరువాత ఎ క్లాసుకు మార్చారు. ఎ క్లాసు మూలంగా ప్రత్యేకమైన గదులుండేవి. ఆగదుల్లో పడుకోడానికి మంచాలతో పాటు చదువుకొడానికి రాసుకొడానికి సౌకర్యాలుండేవి. ఈ జైల్లో వీరితో పాటుగా రాధాబాయి సుబ్బరాయన్, మాధవ మీనన్ భార్య కుట్టి అమ్మాళ్, రంగా గారి భార్య భారతీరంగా, ఆచంట రుక్మిణమ్మ మొదలైన వారుండేవారు. వీరే కాదు అనేక రాష్ట్రాల నుంచి వచ్చిన దేశ భక్తులుండేవారు. జైల్లో కష్టపడుతున్నమనే బాధ లేకుండా ఎంతో సంతోషంగా ఉండేవారు. పురాణ పఠనం తో పాటు మహాత్మాగాంధీ గారు మొదలైన వారిపై పాటలు పాడటమే కాదు, గర్భిణీ స్త్రీలకు సూడిలివ్వడం కూడా చేసేవారు.

పైగా నాటకాలు కూడా వేసేవారు. ఒక సారి వీరు దుష్యంతుని నాటకం వేయగా అందులో దుష్యంతుని వేషంతో సూర్య దేవర రాజ్య లక్ష్మీ దేవి అందరిని మెప్పించారుట.

విడుదలయ్యే ముందు రాజ్యలక్ష్మీ దేవి గారు ముందే దుర్గాబాయిమ్మ గారికి తన రాకను తెలియ జేసారు. అప్పటికి దుర్గాబాయమ్మగారు లాచదువు తున్నారు. ఈవిడను బెనారస్ మెట్రిక్‌కు కట్టించాలని ఆవిడ ఉద్దేశం. ఇంటి నుంచి డబ్బు రానందున అక్కడ ఉండటం కష్టమై తిరిగి తను చేబ్రోలు చేరుకున్నారు.

1940-41లో రాజకీయం పాఠశాలను స్థాపించారు. 1942లో జయప్రకాష్‌నారాయణ ఆంధ్రా కు వచ్చి 5గురు మెంబర్లతో ఒక కమిటీని వేసారు. ఆ అయిదుగురులో ఒకరు రాజ్యలక్ష్మీదేవి.

పంగ వారంతా జైళ్ళపాలయ్యారు. స్త్రీలు అరెస్టు కాకుండా తప్పించుకుంటూ జైళ్ళులో ఉన్న వారికి సహకరించారి.

స్త్రీలు ఉమగ వేషాలు వేసి తిరగ వలసి వచ్చేది. రజ్యలక్ష్మీ దేవి, పురుష వేషంలో తిరిగేవారు. ఈవిడను అరెస్టు చెయ్యడానికి పోలీసులు వారంటు

పట్టుకుని వెతకడం మొదలుపెట్టారు. ఈవిడ అసలు రూపు తెలియక ఆవిడను అరెస్టు చెయ్యలేక పోయారు. ఒక రోజు రాజ్యలక్ష్మీ దేవి గారు అనారోగ్యంగా ఉన్న తల్లిని చూడ్డానికి ఇంటికి వచ్చారు. ఈవిడ కిటికీ తలుపులు తెరిచి బయటకు చూడగా అక్కడ ఉన్న పోలీసులు ఈమెను పసికట్టి వెంబడించారు. రాజ్యలక్ష్మీ దేవి పెరటి గోడ దాటి మూడిళ్ళు దాటి నాలుగో యింటి అటక మీద దాగున్నారు. పోలీసులు అరెస్టు వారంటుతో గాలిస్తూనే ఉన్నారు. ఆ రాత్రి అటక మీదే గడిపిన ఆవిడ తెల్లవారు ఝామున పల్లెపడుచులా ఆకు పచ్చరంగు చీర కట్టుకుని కాలకృత్యాలు తీర్చుకునే నెపంతో చెంబు పట్టుకుని బయటకు వచ్చి పోలీసుల కళ్ళు కప్పి ఆగ్రామ సరిహద్దులు దాటి రాజ్యలక్ష్మీ దేవి తప్పించుకుని పారిపోయారు.

పరదాల మధ్యలో రాణి వాసంలో మసలె ఆవిడ మారు వేషాలతో ఉరకలు, పరుగులు పెడుతూ పారి పోవడం ఆశ్చర్యంగా లేదూ ! ఆవిడ పట్టుదల, చురుకుదనం, కార్య దీక్షచూసి చేబ్రోలు టౌనుకి ఆవిడను కాంగ్రెస్ ప్రెసిడెంటుని చేసారు. అంత దేశ భక్తులైన వారితో కూడా స్వార్థం ఆ కాలంలో కూడా విష సర్పంలా తల ఎత్తుతూనె ఉంది. స్త్రీ, పురుష భేదం లేదనుకున్నా గుండెల్లో రగులుతూనె ఉంది. స్త్రీలను ప్రోత్సహించే పురుషులే పదవికి స్త్రీలు ముందుంటే కాస్త సహించలేక పోయారు. అందుకే ఆవిడ దగ్గర సెక్రటరీగా ఉండటానికి ఎవరూ ముందుకు రాలేదు. ఆవిడ పదవిని చూసి సహించలేక పోయ్యారు. అందులలో ఆవిడ భర్తగారొకరని ఆవిడే తెలియ జేసారు. త్యాగ మూర్తిగా స్త్రీ పేరు ప్రఖ్యాతులు సంపాధించవచ్చు, కాని పదవికి మాత్రం స్త్రీ ముందుండరాదని కొందరు నిరసించారు.

అప్పుడు రాజ్యలక్ష్మీ దేవి తలవంచలేదు. వారిని ఎదుర్కొడానికి సిద్ధపడింది. ఆవిడ స్థాపించిన హిందీ స్కూల్లో చదివిన సీతారావమ్మను సెక్రటరీగా పెట్టుకున్నారు. కర్తవ్యనిర్వహణలో పేరు తెచ్చుకున్నారు.

1944లో రాజ్యలక్ష్మీ దేవి స్థాపించిన రాజకీయ పాఠశాలకు సభాధి సీతారామయ్యగారు రావలసి ఉంది. కాని మనవడు చనిపోవడం వల్ల ఆయన రాలేకపోయారు. కళా వెంకట్రావు గారు, కల్లూరి చంద్ర మౌళి గారు సభకు

వచ్చారు. సభ ఘనంగా జరిగింది.

అప్పటికే కాంగ్రెస్ మీద నిషేధం ఉంది. రాజకీయ పాఠశాలకు ప్రకాశం పంతులు గారిని పిలవాలని ఆవిడ కోరిక. జాతీయ నాయకులు మంత్ర వాది గారి సలహాతో రత్తమ్మగారిని తోడుగా తీసుకుని ప్రకాశం పంతులుగారిని కలవడానికి బయలు దేరింది. ఆయన సంతోషంగా అహ్వానించారు. ఆవిడ రాజకీయ పాఠశాలకు రమ్మని ఆహ్వానించింది. టంగుటూరి ప్రకాశం పంతులుగారు ఆవిడ చందాకు వచ్చారనుకొని - ప్రకాశం నిధినుండి 700 రూ॥ 25 తక్కువగా తనవద్ద నున్నదానిని తీసి ఆవిడ చేతిలో పెట్టారు. మిగిలిన దానిని తర్వాత ఇస్తానని ఆయన చెప్పగా ఆవిడ తాను వచ్చిన పని తెలియ జేసింది. ఆయన ఆధనాన్ని తిరిగి తీసుకోలేదు.

రాజకీయ పాఠశాలను ధనవంతుల ఇంట్లో పెట్టారు. ధనవంతుల కువార్తెలు పంటి నిండా నగలతో రాజకీయ పాఠశాలకు వచ్చేవారు. ప్రారంభానికి కళా వెంకట్రావుగారు తరువాత కల్లూరి చంద్ర మౌళిగారు వచ్చారు. తరువాత ప్రకాశం పంతులుగారు అక్కడకు వచ్చారు.

ఆంధ్ర దేశం నుంచే కాక అన్ని ప్రాంతాల నుంచి సుమారు 47మంది స్త్రీలు ఆ పాఠశాలకు వచ్చేవారు. సుమారు 45 రోజులు ఆ పాఠాలను నడిపించారు. స్త్రీలకు రాజకీయ పరిజ్ఞానం కలిగించాలన్నదే ప్రధానోద్దేశం. ఇందుకు కొంత మంది మగ వారి ప్రోత్సాహం లభించక పోయినా వ్యతిరేకత చూపినా ఆవిడ పట్టుదలతో నిలబడ్డారు. బంధువర్గం సహకరించారు.

ఆవిడ అన్న కొడుక్కి ఖాదీ కొట్టుండేది. ఖాదీ కట్టడానికి ప్రోత్సహించడానికి ఎక్కువ ప్రోత్సాహం లభించడానికి ఎక్కువ అవకాశం లభించింది. కవులుకు తీసుకుని తెలగాలు పొలాలు చూస్తుండేవారు. ఈమె భర్త వాళ్ళ పొలాలు దున్నటానికి వీలు లేదని అడ్డు పెట్టి భూమిని ఎవరికి కవులు కివ్వకుండా చేసారు. ఆడ వాళ్ళకి అన్యాయం జరుగుతోందని మొత్తుకుంటున్నాం గాని ఏకాలంలోనైన ఆడవారి బాధలు ఆడవారివే. రాజ్యలక్ష్మి దేవి భర్తతో రాజీకి రాళ్ళలసి వచ్చింది. 2వంతుల భూమిని భర్తకు రాసిచ్చింది. ఆమె భర్త పంతం నెగ్గిన తరువాత ఆయన మరో వివాహం చేసుకున్నారు. రాజ్యలక్ష్మి దేవి మిగతా భూమిని కవులు కిచ్చుకున్నారు.

అత్తవారి ఊరులో ఇంక ఉండ లేకపోయారు. చాలా మంది మగవారు భర్త పక్షం వారే. అక్కడ ఉండ బుద్ధి గాక ఆవిడ చేబ్రోలు వదిలి పుట్టింటికి చేరుకున్నారు.

చీక టింట్లోనే తెల్లవారినట్లుగా ఆ ఇబ్బందుల్లోనె స్వరాజ్యం వచ్చింది. భరత మాత సంకెళ్ళు వీడి స్వతంత్ర దేశంగా నిలిచింది. దేశమంతా ఆనందంతో ఉరకలు వేస్తుంటే రాజ్యలక్ష్మి దేవి గారి జీవితంలో ఇంకా చీకటి విడిపోలేదు. దుగ్గిరాల బలరామకృష్ణయ్య గారిని రథం మీద కూర్చో పెట్టి ఊరేగించారు. రాజ్యలక్ష్మి దేవి యింట్లోనే ఉండాలను కున్నారు. కాని కార్యకర్తలు ఆవిడను వధలలేదు. నిరాశ నుండి తిరిగి చైతన్యం వైపు ఆవిడ అడుగు లేసారు. అన్నీ మరిచి తిరిగి ఆ సంతోషంతో పాలుపంచుకుని ముందుకు అదుగు వేసారు. ఆ అడుగే ఇప్పటికీ ముందు ఆడుగు వేస్తూనే ఉన్నారు.

తరువాత ఆవిడ మద్రాసులో జరిగే రాజకీయ మహాసభలో పాల్గొనడానికి మద్రాసు వెళ్ళారు. అక్కడ దుర్గాబాయియమ్మగారు ఎంతో ఔదార్యంతో అందరికీ స్వాగతం పలికారు. ఆవిడ స్వాగతం అందరి నారీమణులకు ఆదర్శమైంది.

భారతానికి స్వరాజ్యం వచ్చినా రాజ్యలక్ష్మి దేవిగారి కృషి అంతటితో ఆగలేదు. ఆవిడ దృష్టి తెలంగాణా వైపు మరలింది. తెలంగాణాలో రజాకార్ల అల్లర్లకు నిలువ లేక హయగ్రీవాచారి గారు విజయవాడ వచ్చి నివాసం ఏర్పరచుకున్నారు. అక్కడ స్టేటు కాంగ్రెసు ఆఫీసులో రాజ్యలక్ష్మి దేవి ఆయన్ని కలిసింది. తెలంగాణాలో జరుగుతున్న రజాకార్ల అలర్లు తాను తనకు చేతనైన సహాయం చెయ్యాలని నిశ్చయించుకుంది. రాజాకార్ల అల్లర్లలో బాధ పడుతున్న ఆడవాళ్ళను కాపాడాలని ఆయన కోరగా ఆమెన అందుకు అంగీకరించింది. ఆవిడ 116రూ. ఇవ్వగా ఆయిన ఆవిరాళాన్ని అంగికరించలేదు. కార్యదీక్ష ఉన్నవారికి ఉపాయాలకేమిలోటు. రాజ్యలక్ష్మిదేవి గారు టంగుటూరి సూర్యకుమారి చేత తెనాలి, గంటూరు, బెజవాడల్లో గాన కచేరీలు ఏర్పాటు చేసారు కనక వర్షం కురిసింది. ఆ ధనాన్ని హయగ్రీవా చారిగారికి అంద చేసారు.

ఆవిడ విజయవాడలో పెట్టిన 'తెలుగు దేశం' పత్రికను పోలీసు యాక్షన్ తరువాత హైదరాబాదుకు తరలించారు. ఆంధ్రా తెలంగాణాలు కలిసాయి.

హైదరాబాదు లో 'తెలుగు దేశం' పత్రిక మాడపాటి హనుమంతరావుగారు, వి.వి. రాజుగారు సహాయం చేస్తామని చెప్పగా ఆవిడ పత్రికను విజయవాడ నుంచి హైదరాబాదుకు తరలించారు. వంటి మీద నున్న నగలు అమ్మి పత్రిక ప్రారంభించారు. రాంభట్ల కృష్ణ మూర్తి గారు సబ్ఎడిటర్‌గా పెద్ద పెద్ద ప్రముఖల రచనలు పత్రికలో చోటు చేసుకునేవి. నైజామ్ రాక్షస కృత్యాలను ప్రకటించి 1948 జూన్ 8వ తేదీన మొదటి సంచిక వెలువడింది. సెప్టెంబరు 1949లో మొదట హైదరాబాదుకు వచ్చింది. పొలం అమ్మిన డబ్బుతో ప్రెస్‌కొని నారాయణగుడా (ప్రస్తుతం సుధా కిషోర్ హాస్పిటల్ స్థలం) లో ప్రారంభించారు.

పత్యేక ఆంధ్ర రాష్ట్రం కర్నూలు రజధానిగా ఏర్పడింది. ప్రత్యేక పత్రికను వేసి ఈ గాంధేయవాది కర్నూలు బయలుదేరి వెళ్ళింది. ముఖ్య మంత్రి యైన టంగుటూరి ప్రకాశం పంతులుగారికి దానిని అంద చేసింది. ఆయన తెలుగు దేశం ప్రత్యేక పత్రిక చూసి రాజ్యలక్ష్మీ దేవి గారిని అభినందించారు. తరువాత ప్రకాశం పంతులుగారి నాయకత్వం క్రింద ప్రభుత్వం దిగిపోయింది. అంత వరకు కలిసి పోరాడిన జాతీయ నాయకులలో అనేక భేదాభిప్రాయాలు ఏర్పడ్డాయి. టంగుటూరి ప్రకాశం పంతులుగారు పాలనా నాయకులకు వ్యతిరేకి అయ్యారు.

రాజ్యలక్ష్మీదేవి తన పత్రికాఫీసుకు ప్రకాశంపంతులు గారినే ఆహ్వానించింది. ఆయన ఆవిడ ఆహ్వానంమన్నించి హైదరాబాదు వచ్చారు. అప్పటి హైదరాబాదు నగర మేయరు ఛాయా రామూర్తిగారు, సోషలిస్టు పార్టీ అధినేత సీత మహాదేవ సింగ్ గొప్ప సహాయం చేసారు. మాడపాటి రామ చంద్ర మూర్తి మాత్రం వెనక నుంచే సహాయం అందించారు.

సికింద్రాబాదులో సుభాసు చంద్రబోసు విగ్రహం దగ్గరగొప్ప ఏర్పాట్లు చేసారు. తరువాత ఆవిడ ఆఫీసులో మరో మీటింగ్ ఏర్పాటు చేసారు. వేలాది మంది ఈ సభలకు తరలి వచ్చారు. అందరు ప్రకాశం పంతులు గారిని చూడ టానికే వచ్చారుథ. అయనో గొప్ప వ్యక్తి.

గ్రంథాలయ ఉద్యమంలో మధ్యపాన నిషేధ ఉద్యమంలో ఈవిడ పాత్ర ప్రధానమైంది. మొన్నటి సారా ఉద్యమంలో కూడా ఈవిడ పాత్ర చాలా ఉన్నతమైంది. ఈవిడ ఉత్సాహం తరగనిది. 80సం॥ పైబడిన సంజీవరెడ్డి

నగర్‌లో 89/2RTలో తమ బంధువులతో ఉంటున్నారు. ఉద్యమ స్ఫూర్తి ఆవిడ వెన్నంటి నడుస్తుంది. ఈవిడ జీవితం ఈ దేశానికి అంకితం. భారత స్వాతంత్ర సమరమహా యజ్ఞంలో ఇటువంటి నారీమణులు ఎందరో వారి త్యాగ ఫలమే ఈ స్వతంత్ర భారతం.

## శ్రీమతి సూర్య దేవర రాజ్యలక్ష్మి దేవి గారితో ముఖాముఖీ

ప్రశ్న : సామాజిక పరంగా ఈ నాటి స్త్రీల బాధ్యత ఎలా ఉందంటారు?

సమాధానం : ఈనాటి స్త్రీలు చదువుకున్నారు? విజ్ఞాన వంతులు - సమాజాన్ని ఎంతో అర్థంచేసుకున్నారు? అనుకున్న విధంగా ఈనాటి స్త్రీలు సామాజిక బాధ్యతని నిర్వహించడానికి ఉత్సాహంచూపుతున్నారు.

ప్రశ్న : వరకట్న సమస్యలు అలాగే ఉండటానికి కారణం?

సమాధానం : స్త్రీలు స్వచ్ఛందంగా మరింత ముందుకు రావలసి ఉంది. ప్రభుత్వ చట్టాలే కాని జనంలో నుంచి ఉద్యమం రాలేదు. స్త్రీల లోనుంచే ఆ ఉద్యమం పుట్టాలి. అప్పుడు వరకట్నం రూపు మాసిపోతుంది.

ప్రశ్న : మధ్యపాన నిషేధాన్ని గురించి మీ అభిప్రాయం ?

సమాధానం : స్త్రీలందరూ పూర్తి మధ్యపాన నిషేధం కావాలంటున్నారు, అలా పూర్తి నిషేధం వస్తేనే కుటుంబాలకు మరింత ఉపయోగం జరుగుతుంది. కుటుంబ సంక్షేమమే దేశసంక్షేమం కదా!

ప్రశ్న : ఈ నాటి రాజకీయాల్లో స్త్రీలు చాలా తక్కువ మందున్నారు! దానికి కారణం ఏమిటంటారు?

సమాధానం : కుతంత్ర రాజకీయాలవడం వల్ల గూండాయిజం రాజ్య మేలుతోంది. అన్యాయాలు అక్రమాలు ఎక్కువయ్యాయి. అందుకే స్త్రీలు నిలబడలేక దూరంగా ఉంటున్నారు. స్త్రీలు ధైర్యంగా ముందుకు రావాలి. స్త్రీకి నిదానం, నెమ్మది తనం, నిజాయితీ కూడా ఎక్కువే? స్త్రీలు రాజకీయరంగంలో కుడా ఎక్కువగా ప్రవేశిస్తేనే ఈ దేశం మరింత ముందుకు వెళ్తుంది.



# నిస్వార్థసేవా పరాయణురాలు
# స్వాతంత్ర్యసమరయోధురాలు
# తామ్రపత్రగ్రహీత
# శ్రీమతి పసల అంజలక్ష్మిగారు

భారత స్వాతంత్ర్యోద్యమానికి జీవితం అంకితం చేసిన సాహస నారీమణులెందరో; అందరిలో ప్రముఖురాలు నిరాడంబర మూర్తి, శ్రీమతి పసల అంజలక్ష్మిగారు.

ధనవంతులే కాకుండా ఉన్నత ధర్మాలు కలిగిన కుటుంబీకురాలు అవడంవల్ల అంజలక్ష్మిగారు భర్త ఆశయాలకు అనుగుణంగా తాను మసులుకుంటూ దానధర్మాలు చేయడానికి, బీదవారి నెందరినో ఆదరించడానికి ముందు కొచ్చారు. ఉన్నదంతా దేశంకోసం సమర్పించిన త్యాగమూర్తి ఆమె. ఆ కాలంలో ఆడవారు వీధుల్లోకి రావడమే అరుదైన రోజుల్లో ఉద్యమంలో పాల్గొనడానికి ముందుకువచ్చి జైలుకు వెళ్ళిన సాహస స్త్రీ మూర్తి ఆమె. చంటి పిల్లలతల్లియైన, నిండు గర్భవతియైన మాతృదేశ దాస్యవిముక్తికై విదేశీ కర్కశ సైన్యాన్ని ఎదురించి నిలిచిన వీరనారీమణి శ్రీమతి అంజలక్ష్మి. స్వరాజ్యం వచ్చిన తరువాత ఏ పదవులు ఆశించక, గృహిణిగా స్థిరపడిన నారీమణి ఆమె. ఆనాడు బంధువులు విమర్శించినా, ఆత్మీయులు నిరసించినా వేటినీ లెక్క చేయక కార్య దీక్ష చేసిన కాంగ్రెస్ కార్య కర్త ఆమె. పసుపు, కుంకుమలు, పచ్చని గాజులు భర్త తోటివే అన్న మూఢ నమ్మకాలకు స్వస్తి చెప్పి భర్త ఆదేశానుసారం, ఆయన పసల కృష్ణ మూర్తిగారు ఈ లోకంలో లేకపోయినను తెలుగింటి పడతిలా ఉన్న అభ్యుదయశీలి. శ్రీమతి పసల అంజలక్ష్మిగారు ఈనాటి స్త్రీలోకానికే ఆదర్శ నారీమణి ఆమె. ఉన్నతాశయాలను, ఆదర్శాలను ఆచరణలో చూపిన వితరణ శీలి ఆమె.

పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకాలో చిన్న కుగ్రామం కుముదవల్లి, అంజలక్ష్మిగారి జన్మస్థలం. 1904లో శ్రీమతి దాసం వెంకమ్మ, దాసం వెంకట్రామయ్య దంపతుల గర్భమున జన్మించిన అంజలక్ష్మి భారత స్వాతంత్ర్య సమరంలో కార్యకర్తగా పనిచేసి దాన ధర్మాలలో అందెవేసిన చేయిగా కీర్తి గడిస్తుందని ఆనాడు ఎవ్వరు అనుకోలేదు.

ఇద్దరు సోదరీమణుల మధ్యలో సోదరునికి అక్కగా జన్మించిన అంజలక్ష్మి చదువులో రెండవ తరగతి చదువుకున్నా సంస్కారంతో మొదటి తరగతికి చెందిన స్త్రీగా మానవత్వాన్ని పెంచుకున్న మహా మనీషి ఆమె. 12 వత్సరాల బాలికయైన అంజలక్ష్మి జీవితం వివాహం జరగడంతో కొత్త మలుపు తిరిగింది. ''వివాహే విద్యనాశనే'' అంటారుకాని ''వివాహం దేశసేవాదాయకం'' అని ఎవరు చెప్పకపోయినా ఆమె జీవితానికి అది వరమయింది. పడమర విపర్రు గ్రామవాస్తవ్యులయిన పసల కృష్ణమూర్తిగారితో వివాహం ఆమె పన్నెండవ ఏట జరిగింది. 1916 ప్రాంతమది. ఎంతో అనుకూలమైన దంపతులు వారు 16 సంవత్సరంలో 1920 నాటికి అత్తింటిలో అడుగుపెట్టింది అంజలక్ష్మి. ఆమె పెద్ద కుమారుడు 3 ఏళ్ళ వయస్సులో ఉండగా ఆబాలునితోనే ఆరు నెలల గర్భవతి తెల్లసైన్యాన్ని ఎదురించి జైలుకు వెళ్ళింది.

ఆసేతుహిమాచలం స్వరాజ్యం కోసం తహతహలాడుతున్న రోజులవి. మహాత్మాగాంధి న్యాయకత్వం అందరిని ఆకర్షించింది. అందరు ప్రాణాలకు తెగించి స్వరాజ్య సమరంలో పాల్గొంటున్నారు. చదువులను వదలి, ఉద్యోగాలుమాని, ఆస్థిపాస్తులను దేశం కోసం సమర్పిస్తున్న రోజులవి.

1921లో దేశనేత, అహింసా సిద్ధాంతమూర్తి నిరాడంబర వ్యక్తి, మహాత్మాగాంధి ఆంధ్ర దేశ పర్యటనకు వచ్చి బెజవాడకువచ్చారు. అప్పుడు పసల కృష్ణమూర్తిగారు కాంగ్రేసును ఆహ్వానించి కాంగ్రెస్‌లో చేరి జిల్లా కాంగ్రెస్ సంఘ సభ్యులు అయ్యారు. అంజలక్ష్మిగారు ఆయన అడుగు జాడల్లో నడుస్తూ కాంగ్రెస్ వాదిగా ఖద్దరు కట్టడం, నూలు వడకడం ప్రారంభించారు. మహాత్మాగాంధీ ఆదేశానుసారం విదేశీ వస్తు బహిష్కరణలో పాల్గొనడమే కాకుండా హరిజనులను ఆదరించడంవంటి కార్యక్రమాలు చేపట్టి కాంగ్రెస్ ఆశయాలను ఆచరణలో పెట్టడానికి కృషి ప్రారంభించారు.

సర్వజన సమానతే గాంధి మహాత్ముని ఆదర్శమైతే ఈ దంపతులు కూడా జాతి, మత, కుల, వివక్షతను పాటించక సర్వజనులను ఆదరించడమే ఆశయంగా పెట్టుకున్నారు. స్వయంగా వడికి నేసిన బట్టలనే ధరించడం ఈ దంపతులు నియమముగా పెట్టుకొన్నారు. భర్తతో పాటు కాంగ్రెస్‌లో చేరి కార్యకర్తగాపనిచేస్తూ భర్తకు అన్ని విధాలా సహకరించారు. పసల కృష్ణ మూర్తిగారు జిల్లా కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ కార్యదర్శిగా పనిచేస్తున్నప్పుడు మహాత్మాగాంధీగారు పశ్చిమ గోదావరి జిల్లా పర్యటనకు వచ్చారు. అప్పుడు అంజలక్ష్మి గారు కాంగ్రెస్‌లో భర్త వెనువెంటే పనిచేస్తూ భర్తకు అన్నివిధాలా సహకరించారు. కాంగ్రెస్ కార్యక్రమాలన్నిటిలోను పాల్గొనడం ప్రారంభించారు. ఆ పర్యటనలోని మహాత్మాగాంధి చాగల్లు ఆశ్రమ సందర్శనానికి వెళ్ళారు. ఎంతోమంది తెలుగుపడతులు ఆభరణాలను తీసి మహాత్మాగాంధీకి సమర్పిస్తున్నారు. పసల అంజలక్ష్మిగారు తనవంటి మీదనున్న బంగారాన్నంతటినీతీసి మహాత్మాగాంధీకి సమర్పించారు. ఆమె ఒడిలో కూర్చున్న 5 సం. పెద్ద కూతురు సత్యవతి కూడా మెడలో నున్న గొలుసును, చేతి మురుగులను తీసి మహాత్మాగాంధీకి సమర్పించారు. ఆ తల్లికి తగ్గ త్యాగమూర్తి ఆకూతురు. వంటిమీద నగలను వలిచి ఇవ్వడమేకాదు మహాత్మాగాంధీ ఆదేశానుసారము బంగారునగలను ధరించడమే మానుకొన్న ఆదర్శశీలి అంజలక్ష్మి.

సన్యాసి జీవితం కంటే సంసారి జీవితం గొప్పది అన్నారు కొందరు పెద్దలు. అంజలక్ష్మి కృష్ణమూర్తిగార్ల సంసార జీవితమే అందుకు ఆదర్శం. ఇంటికి వచ్చిన అతిథులనే కాదు అవసరంలో ఉన్నవారినందరిఆదరిస్తూ అన్నదానాలు చేస్తూ పడమర విప్పర్రులోనే కాకుండా చుట్టు పక్కలగ్రామాలలోనెకాదు బంధుమిత్రులలోను ఆదర్శ దంపతులుగా పేరు సంపాదించారు. సన్యాసులు ఈ దానధర్మాలు చేయగలరా? ఆపదలో ఆదుకోగలరా?

ఒకపక్క స్వాతంత్ర్యోద్యమం మహోన్నతంగా విజృంభిస్తుంటే మరో పక్క వీరేశ లింగం పంతులు గారిసంఘ దురాచారోద్యమం మరింత ప్రజ్వలించింది. ఆ ప్రభావం ఈ కాంగ్రెస్ దీక్షా పరురాలు అంజలక్ష్మి గారి

మీదపడింది. వితంతు వివాహాలతోపాటు కులాంతర వివాహాలను ప్రోత్సహిస్తూ, తన సొంత ధనం ఖర్చు పెట్టి ఎన్నో వివాహాలు దగ్గరుండి జరిపించారు.

అంతేకాదు హరిజనోద్ధరణ మహాత్మాగాంధీ ఆశయాలలో ఒకటి అవడం వలన ఈ దంపతులు కొంతమంది హరిజన విద్యార్థులను చేరదీసి వారిని తమ సంతానంలాగే పెంచి వారిని పెద్దచేసారు.

ఆవిడ కార్యదీక్షతకు, ఉత్సాహానికి తగినట్లుగా అవకాశాలు అంజలక్ష్మి గారికి ఎదురుగావచ్చి నిలిచాయి. 21-1-31న భీమవరంలో సత్యాగ్రహం ప్రారంభమయింది. అంజలక్ష్మిగారు అందులో పాల్గొన్న కారణంగా ఆమెను అరెస్టు చేసి మద్రాసు జైలుకు పంపించారు. జైలు జీవితం మహా పుణ్య కార్యంగా భావించారు. ఎందరో కాంగ్రెస్ కార్యకర్తలుగా అరెస్టు అయిన నారీమణు లెందరినో కలుసుకున్నారు. జైలు కూడును భరతమాత ప్రసాదంగా భావించారు. ప్రార్థనా గీతాలతో జాతీయ గీతాలాపనలతో కాలక్షేపం చేసారు. 19-7-31న తిరిగి విడుదలయ్యారు. ఎందరో కార్యకర్తలు స్వాగతం పలుకుతుంటే స్వగ్రామం చేరుకున్నారు. ఈ జైలు శిక్షలకు వారి ఉత్సాహం మరింత పొంగి పొరలింది.

1932 జూన్ 27వ తేదీ ఆ ఆదర్శ దంపతుల జీవితంలోనేకాదు ఆంధ్ర దేశ ఉద్యమ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపవలసిన రోజది.

శ్రీ పసల కృష్ణమూర్తిగారి అధ్యక్షతలో భీమవరం తాలుకాఫీసు మీద బ్రిటీషు జండాను దింపి కాంగ్రెస్ పతాకాన్ని ఎగురవెయ్యడానికి ఉద్యమం చేపట్టారు. ముందుగానే పరాయి పాలకులకు నోటీసు ఇచ్చారు. అడ్డదారిని పసల కృష్ణమూర్తి గారు భార్య అంజలక్ష్మి గారితో కాంగ్రెస్ కార్యకర్తల దేశభక్తి గీతాల నడుమ ''వందేమాతర'' నినాదాల మధ్య నుదుట కుంకుమ రేఖలతో దీక్షా కంకణ బద్ధులై ముందుకు అడుగులు వేసారు. ఆ అడుగుల సవ్వడికి భరత భూమి పులకరిస్తే పరాయి పాలకుల గుండెలు గుభిల్లు మన్నాయి.

రైళ్ళ మీద, బస్సుల మీద రైఫిళ్ళతో బయలుదేరారు. విజయం కార్యకర్తలదే. అందుకే వీరి ముందుగ గమ్యస్థలం చేరుకున్నారు. పరాయి పాలక జండాను దింపి కాంగ్రెస్ జెండా వేయడానికి దేశభక్తులు, కార్యదీక్షానిరతులు పసల కృష్ణమూర్తిగారు ముందుకొచ్చారు. వారి వెనకే వారి ధర్మపత్ని 6 నెలల

గర్భవతి అంజలక్ష్మిగారు నిలబడ్డారు. ఆ జెండాను దింపి ఈ జెండా ఎగుర వేయడానికి పైకి ఎక్కినవారితో ధైర్యసాహసాలకే ఊపిరి పోసిన మాణిక్యాంబ గారు కూడా ఉన్నారు. అంతలో ఆంగ్ల సైన్యం అక్కడకు చేరుకుంది. కర్కశత్వంతో ముందువెనుక చూడకుండా లాఠీలతో చావబాదడం మొదలుపెట్టాలనుకున్నారు. అయినా అదే ప్రజాశక్తి వెల్లువ, ఉత్సాహంతో ముందుకు వచ్చింది. దానిని ఎవరు ఆపగలరు. ఆ జెండాను దింపగా వీర నాయకులు కృష్ణమూర్తిగారు అనుకున్నట్లుగానే కాంగ్రెస్ జెండా ఎగురవేశారు. ప్రప్రథమంగా ప్రభుత్వ కార్యాలయంపై త్రివర్ణ పతాకాన్ని ఎగురవేసిన ఘనకీర్తి ఆంధ్రదేశానికి, కార్యదీక్షా పరులు కృష్ణమూర్తి, అంజలక్ష్మి గారలకు దక్కింది. దక్షిణ భారత దేశంలో ఇటువంటి సాహసం చేసిన పుణ్యదంపతులు వీరే.

పైగా తాలూకా ఆఫీసు మీద పరాయి పాలకుల జెండాను దింపకుండా కాంగ్రెస్ పతాకం ఎగుర వేయకుండా ఆపడానికి, అవసరమైతే లాఠీ ఛార్జి చెయ్యడానికి వచ్చిన డి.ఎస్.పి. గారు ఆ పని చెయ్యలేకపోయారు. గర్భవతియైన అంజలక్ష్మిగారిని చూసి 'మారో' అనడానికి బదులు 'డౌన్' అనడం భీమవరం కాంగ్రెస్ చరిత్రలో అపూర్వ ఘట్టంగా ఈ సంఘటన పేర్కొన్నారు.

ఆనాడు అంజలక్ష్మి గారితోపాటు, ఉద్దరాజు మాణిక్యాంబగారు, మాగంటి అన్నపూర్ణాదేవి, పాణకా కనకమ్మగారు మొదలగు నారీమణులెందరో అరెస్టు అయ్యారు. అందరిని భీమవరం పోలీసు స్టేషనుకు తీసుకు వెళ్ళారు. అక్కడ నుండి ఆ సాయంకాలం ఆడువారిని రాయవెల్లూరు జైలుకు తీసుకువెళ్ళారు. ఆనాడు ఆరునెలల గర్భవతియైన అంజలక్ష్మిగారు పెద్ద కుమారుడైన ఆది నారాయణను కూడా జైలుకు తీసుకువెళ్ళడం అందరికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

అంజలక్ష్మిగారు స్వభావ సిద్ధంగా శాంత స్వభావం కలవారు. గర్భవతి యైన అంజలక్ష్మి గారికి తోడుగా ఉద్దరాజు మాణిక్యాంబగారు ఉన్నారు. ఇంటి నుంచి సున్ని పిండి వచ్చేది. ఆ సున్ని పిండిలో మధ్య డబ్బును పెట్టి పోలీసులకళ్లు కప్పి పంపేవారు. ఆమెకు పురుటి నొప్పులు రాగానే అధికారులకు తెలియజెయ్యగా వారు వెంటనే నర్సులను పంపించారుట. ఆ జైలులో పుట్టిన కుమార్తెకు

కృష్ణభారతి అని పేరు పెట్టారు. ఆనాడు ఎందరో గాంధీ పేర్లు, గోఖలే, తిలక్, సుభాష్‌చంద్రబోస్ వంటి నాయకులపేర్లే కాకుండా భరతమాత పేరును ఎందరో పెట్టుకున్నారు.

శ్రీకృష్ణునివలెనే ఈ బాలిక కూడా జైల్లో పుట్టడం వల్ల కృష్ణ అని, భారతమాత సేవకులు అవడం వల్ల రెండు కలిపి కృష్ణభారతి అను నామకరణం జైల్లోనే ఆ ముద్దులపాపకు చేశారు. పైగా అంజలక్ష్మిగారు గర్భవతిగా ఉండడంవల్ల ఆమెకు ఉద్దరాజు మాణిక్యాంబగారు మొదలగు వారందరు కలిసి వేడుకగా జైల్లోనే సూడిదలు కూడా ఇచ్చారుట.

ఆనాడు ఆడువారిని జైలుకు తీసుకువెళ్ళగానే వారిచేత అంచుల్లేని తెల్ల చీరలు కట్టించేవారు. పైగా చేతిగాజులను పగుల గొట్టించేవారు. గాజుగాజులుంటే ప్రాణాపాయమని వారి భావన. అప్పటికి సాధారణంగా జైలుకు వెళ్ళే స్త్రీలు దొంగలో లేక హత్యకారులో అయి ఉండేవారు. అందుచేత ప్రభుత్వపు ఆదేశాన్ని పాటించేవారు.

ఇప్పుడు జైలుకు వెళ్ళినవారు అటువంటి వారు కాదు. వీరు దేశమాతకై ప్రాణాలర్పించడానికి ముందుకు వచ్చిన త్యాగ ధనులు. కార్యదీక్షా కంకణబద్ధులు. ఈ స్త్రీలు ఆ విధంగా అంచులు లేని తెల్ల గుడ్డలు కట్టమని, చేతిగాజులు పగులగొట్టడానికి వీలువేదని మొరాయించారు. అది భారతీయ మహిళా సంస్కృతినే కించ పరచడమేనని వీరు నిరసన తెలియజేశారు. జైలు అధికారులు అంగీకరించలేదు. అది తెలిసిన ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు గారు రాయివెల్లూరు జైలుకు వెళ్ళి అంతా తెలుసుకున్నారు. జైలు అధికారులతో మాట్లాడి అటువంటి పనులు చేయడం భారతీయ స్త్రీ జాతికే అవమానకరమని వాదించగా అందుకు వారు ప్రకాశం పంతులుగారితో వాదించలేక అంగీకరించారు. వెంటనే వారు అంచులున్న చీరలు, ఆడువారు కట్టుకోడానికి అంగీకరించారు. గాజు గాజులకు బదులుగా రబ్బరుగాజులు చేతులకు వేసుకోవడానికి అంగీకరించారు.

కాంగ్రెస్ నాయకులలో ప్రముఖులైన భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు రాయవెల్లూరు జైలుకు వెళ్ళి స్త్రీల నందరినీ పలుకరించి

వారి కష్టసుఖాలను, జైలు పరిస్థితులను తెలుసుకున్నారు. స్త్రీలు ప్లాస్టిక్ గాజులు ధరించడానికి జైలు అధికారులు అంగీకరించినందుకు ఆయన సంతోషం వ్యక్తం చేశారు. జైలులో ఉన్న ప్రతి ఆడువారికి పచ్చరంగు ప్లాస్టిక్ గాజులు పంపిస్తానని తెలియజేసారు. తరువాత ఆయన మహాసంతోషంగా జైలులో ఉన్న స్త్రీలందరికీ పచ్చని ప్లాస్టిక్ గాజులు పంపించడం మొదలుపెట్టారట.

అక్కడ కాలక్షేపానికి హరిశ్చంద్ర నాటకం వేయగా మాణిక్యాంబగారు నక్షత్ర పాత్ర వేయగా అంజలక్ష్మిగారు అటువంటివి అలవాటు లేనందున నాటకం చూసే ప్రేక్షకురాలిగా కూర్చుని ఎంతో ఆనందించారు.

తరువాత అంజలక్ష్మిగారిని కన్ననూరు జైలుకు పంపించారు. 12-1-33 నుండి కన్ననూరు జైలులోనే ఉన్నారు. 14-4-33న కన్ననూరు జైలునుండి విడుదలచేశారు. అప్పటికి చంటిపిల్లకు ఆరు మాసాలు వచ్చాయి. కృష్ణభారతిని, ఆదినారాయణను తీసుకుని అంజలక్ష్మిగారు స్వగ్రామం తిరిగివచ్చారు. కార్యకర్తలతోపాటు గ్రామస్త్రీలు, చుట్టుపక్కల గ్రామస్త్రీలు ఎంతో ఉత్సాహంతో ఆమెకు స్వాగతం పలికారు. కొందరు బంధువులు విమర్శిస్తున్నా ఆవిడ కార్యదీక్షకు అవి అడ్డురాలేదు. ఆవిడతోపాటు దుర్గాబాయమ్మగారు, మాగంటి అన్నపూర్ణమ్మ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, కంభంపాటి మాణిక్యాంబగారు జైలులో ఉండేవారు. గాంధీ సిద్ధాంతాలను ఆచరణలోచూపిన ఆదర్శదంపతులు వీరు. మాంసాహారాన్నిత్యజించి శాఖాహారాన్నే భుజించడం మొదలుపెట్టారు. పైగా భోగం మేళాలను నిరసించారు. ఆదరశవివాహాలు చేసేవారిని ప్రోత్సహించారు. అలాచేయనివారు బంధువులైనా వీరు వారిళ్ళకు వెళ్ళక నిరసన వ్యక్తం చేశారు. ఆ కారణం కొందరు శత్రువులైనా ఈ దంపతులు లెక్కచేయలేదు.

ఉన్నదంతా దానధర్మాలకు ఖర్చుచేశారు. చేతిలో ఈవిడ బొప్పాయిచెట్లు పెంచి 300/- రూ.లు సంపాదించారుట. ఉద్యమగీతాలతోపాటు రామాయణంలో పాటలు పాడుకుంటూ ఉత్సాహం తెచ్చుకునేవారు.

1929లో సీతానగర్ సేవాశ్రమమం ఆదర్శంగా దంపతులు స్వగ్రామంలో

ఒకధర్మాసుపత్రిని స్థాపించారు. అందులో ఒక డాక్టరుని నియమించి గ్రామప్రజలకు ఉచిత సేవలందించారు. కృష్ణమూర్తిగారే కాంపౌండరు, అంజలక్ష్మిగారే నర్సు. ఎందరో రోగులకు తమ సేవలందించారు. వీరు కోరినట్లుగా బొంబాయి మందులు కంపెనీ వారు ఈ ధర్మాసుపత్రికి మందులు, పరికరాలు అందజేసి తమ కర్తవ్యాన్ని నెరవేర్చుకొనేవారు. ఉద్యమదీక్షతోపాటు ''మానవసేవే మాధవ సేవయని'' భావించిన ప్రజాసేవకురాలు శ్రీమతిఅంజలక్ష్మిగారు.

స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా జరిగిన అన్ని ఉద్యమాలలోను అంజలక్ష్మిగారు భర్తతోపాటు పాల్గొన్నారు. స్వరాజ్యం వచ్చినప్పుడు వీరి సంతోషానికి అంతులేదు. చేసిన ఉద్యమకృషికి ఫలితం భారత దేశ స్వాతంత్ర్యమే కదా! ఆ విజయం లభించింది. ఆ నిస్వార్ధ సేవామూర్తులకు అంతకంటే ఏంకావాలి?

స్వాతంత్ర్యానంతరం ఏ పదవులు వారు కోరుకోలేదు. స్వాతంత్ర్య సమర యోధురాలిగా ప్రభుత్వం నుండి ఉపకారవేతనము, తామ్ర పత్రం గ్రహించిన ఉపకార వేతనాన్ని తిరస్కరించిన ఆదర్శమహిళ అంజలక్ష్మిగారు.

స్వరాజ్యం వచ్చిన తరువాత ఆ సంతోషం వారికి ఎక్కువ కాలం నిలువలేదు. రాజకీయ రంగంలో ప్రవేశించిన ఆశ్రిత పక్షపాతం, అవినీతి, దౌర్జన్యం, స్వార్ధచింత ఆమెను రాజకీయాల నుండి దూరంజరిపాయి. పదవుల కోసం పాకులాడకుండా, కుటిల రాజకీయాలకు దూరమై ప్రశాంతంగా కుటుంబంలో ఉత్తమగృహిణిగా సేవలందిస్తున్నారు. వరకట్న దురాచారాన్ని నిరసించి దానిని ఆచరణలో చూపించారు.

అంజలక్ష్మి దంపతులకు 4 గురు కుమార్తెలు, 4గురు కుమారులు. ఇద్దరు కుమార్తెలు డాక్టర్లు. ఒక కుమార్తె లండన్‌లో వైద్యవృత్తిలో ఉన్నారు. ప్రస్తుతం అంజలక్ష్మిగారు కృష్ణాసుపత్రి నిర్మించిన తన కుమార్తె దగ్గర మిగిలిన సంతానంతో ప్రశాంతంగా ఉంటున్నారు. 92 సం.ల వయస్సులో కూడా ఖద్దరును మాత్రమే ధరించే దేశభక్తురాలు ఈమె. గుమ్మంలోకి ఎవరు వచ్చినా తిండి పెట్టాలనే ఈమె గుణాన్ని సంతానం కూడా పంచుకున్నారు. ''మాతృదేవోభవ'' అన్నట్లు కన్నతల్లిని ఆదరిస్తున్న ఆ సంతానం ఆమెకు వరం.

ఈవిడ సత్కారాలను, సన్మానాలను ఆశించలేదు. అయినా ఎందరో ఆమెను సత్కరించాలని ఆశపడ్డారు.. అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో నల్లజర్లలో కలెక్టరుగారి సతీమణి నిర్మలాదేవి ఈవిడను సత్కరించి గౌరవించారు.

తాడేపల్లి గూడెంలో ఆఫీసర్స్క్లబ్‌వారు, డా. గోయింగా మహిళా కళాశాల వారు ఈవిడను సత్కరించారు.

హైదరాబాదులో 2-10-1995 బాపూజీ 125వ జన్మదినోత్సవ సందర్భంగా ఆంధ్రమహిళా సభ ఆధ్వర్యంలో సన్మానం అందుకున్నారు.

దేశమాతకు గర్వకారణం ఈమె జీవితం. ఈత్యాగమూర్తిని, నిరాడంబర మహిళను సత్కరించడం దేశమాతను సత్కరించినట్లే.

శ్రీమతి పసల అంజలక్ష్మిగారి సమాధానాలు

ప్రశ్న : స్వరాజ్యం వచ్చిన తరువాత మార్పేమైనా ఉందంటారా?

సమాధానం : మార్పులేకేమి? ఉందమ్మా? అనేక రంగాల్లో దేశం అభివృద్ధి చెందింది. అందరు చదువుకుంటున్నారు. శాస్త్రజ్ఞానం పెరిగింది. కాని దేశం అనుకున్నంత బాగుపడలేదు! జనంలో క్రమశిక్షణ, నిజాయితీ లోపమే దీనికి కారణం.!

ప్రశ్న : ఈనాటి మహిళలను గురించి మీ అభిప్రాయం!

సమాధానం : ఈనాటి మహిళలు అన్ని రంగాల్లోను ముందున్నారు. కాని వీరిలో స్వార్థ చింతన ఎక్కువ. తను పిల్లలు, భర్త తప్ప ఎవరు పనికిరారు! అత్త మామ మొదలైన సంబంధాలే తెగిపోతున్నాయి.

ప్రశ్న : ఈనాటి జనం ఎలా ఉన్నారంటారు?

సమాధానం : స్త్రీలు కూడా జనంలోకే వస్తారు. ఈనాటి జనంలో డబ్బు, మతం, దేవుడు, ఈ ప్రచారం ఎక్కువగా ఉంది. వీటినే ఎజెండ పెట్టుకుంటున్నారు.

ప్రశ్న : ఈనాటి రాజకీయాల్లో మహిళల పాత్ర ఎలా ఉండేదంటారు?

సమాధానం : ఈనాటి రాజకీయాలకు మహిళ చాలా దూరంగా ఉంది. అందులో చదువుకున్న స్త్రీలు ముందుకు వస్తేనే ఈ రాజకీయాలు బాగుపడతాయి. స్త్రీలలో నిజాయితీ పట్టుదల ఎక్కువే ఉంటాయి. వారు దేశం కోసం కొంత సమయం త్యాగం చెయ్యాలి. కేవలం డబ్బు సంపాదనే ధ్యేయం కాకూడదు.

ప్రశ్న : ఈనాడు స్త్రీలపై జరుగుతున్న ఈ అత్యాచారాలకు నివారణ ఏమిటంటారు?

సమాధానం : ఆత్మరక్షణే నివారణ. ఏప్రభుత్వమో వచ్చి ఆదరిస్తుందని, పోలీసులు కాపాడతారని ఎదురు చూడకుండా స్త్రీలంతా ఏకమై తమలోని శక్తి సామర్థ్యాలను చూపించి ముందుకు రావాలి. అప్పుడు ఆత్మరక్షణ అదే జరుగుతుంది.

**జైహింద్**



# భారత స్వాతంత్ర్యోద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన సాహస మహిళ శ్రీమతి ఉద్ద రాజుమాణిక్యాంబ గారు

భారత స్వాతంత్ర్య సమరంలో ప్రాణాలకు తెగించి నిస్వార్థంగా పోరాటం సాగించిన నారీమణులలో శ్రీమతి మాణిక్యాంబ గారు ప్రముఖులు. విద్యాగంధం లేక పోయినా సంస్కార గంధాన్ని, త్యాగ గంధాన్ని హృదయం నిండా నిపుకొనిన తెలుగు వీర నారీ మణి ఈమె.

భారత దేశ మంతా బానిసత్వపు సంకెళ్ళతో అజ్ఞానపు చీకటిలో, బాధల వలయంలో అల్లాడి పోతున్న రోజులవి. ఇంకా మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం కాలేదు. బాల గంగాధర తిలక్, మహాత్మాగాంధీ వంటి జాతీయ నాయకుల ప్రబోధంతో అప్పుడప్పుడే దేశ ప్రజలు కళ్ళు తెరుస్తున్న రోజులవి. తూర్పు గోదావరి జిల్లా అమలాపురం తాలుకా మన్నెచింతలపూడి గ్రామంలో నడింపల్లి బాపిరాజుగారికి 1913 లో మాణిక్యాంబగారు జన్మించారు. బాపిరాజుగారికి 5 మగపిల్లలు ఇద్దరు కుమార్తెలు. రెండవ కుమార్తె మాణిక్యాంబ గారు. ఆ కాలంలో మగ పిల్లలకే చదువులు లేవు. ఇక ఆడపిల్లల చదువు సంగతి ఆలోచించేదెవరు. పైగా విద్యాభ్యాసం చేయించడానికి ఆ పల్లెల్లో పాఠశాలలులేవు. పాఠాలు చెప్పడానికి పంతుళ్ళు లేరు. చదువుకోడానికి పాఠ్యగ్రంధాలు లేవు. రాసుకోడానికి పలకలే లేవు

ఆసక్తి ఉన్న వారికి చుట్టూ ఉన్న ఇసుక తిన్నెలే పలకలు. ఆ ఇసుక తిన్నెల్లో వేళ్ళేబలపాలు చేసి అక్షరాలు దిద్దుకుంది మాణిక్యాంబ. ఆనాడు ఎవరూ ఆమె జాతీయోద్యమంలో పాల్గొనేటంత ధైర్యసాహసాలు గలకన్యయని

ఊహించలేదు. బాపి రాజుగారి బావమరిది పద్మ నాభరాజు గారి కుమారుడు రామరాజుగారితో మాణిక్యాంబ గారికి 1930 లో వివాహం జరిగింది. చదువు లేక పోయినా అత్తింట్లో కాపురం చేయగల సామర్ధ్యం, భర్త వెంట నడువగల నేర్పరితనం సంపాదించుకుంది. అత్తగారిల్లు పశ్చిమ గోదావరి జిల్లా పాలమట్టు సమీపంలోని వాలమట్టు చేరుకుంది. అత్తింట్లో, పుట్టింట్లో అందరు జాతీయ కాంగ్రెస్సులో చేరి ఉద్యమాలు నడిపించే దేశభక్తులు.

ఆమే భర్త రామంగారు జాతీయ కాంగ్రెస్సులో యువనాయకులై ఆంధ్ర దేశంలో ఉద్యమ నాయకులుగా నిలచారు. 1930లో సత్యాగ్రహంలో పాల్గొని ఆంగ్లేయులచే బంధింపబడి కారాగారానికి వెళ్ళారు.

ప్రేమ లేఖలు రాసే వయసులో రామంగారు జైలు నుండి ఉద్యమగాధలను, జైలు జీవితాలను గురించి భార్య మాణిక్యాంబ గారికి ఎన్నో లేఖలు రాసారు. భర్త దూరంగా ఉండటం వల్ల విరహంతో వుండ వలసిన మాణిక్యాంబ దేశ భక్తిని పెంచుకుంది. భర్త లేఖలే ఆమెను ఉద్యమంవైపునడిపించాయి.

ఆ సమయంలో మాణిక్యాంబగారు గాంధీగారి ఆత్మవిజయం చదవడం మొదలు పెట్టారు. భర్త లేఖలలో రాసినట్లుగా మాణిక్యాంబ గారు నూలు వడకడం, ఖద్దరు బట్టలు కట్టడం మొదలు పెట్టారు. ఆ కాలంలో 5రూ. మించి చీరలు కట్టకూడదని గాంధీ గారి ఆదేశంప్రకారం నిరాడంబరంగా జీవించాలని భర్త ఉత్తరాలలో రాసినట్లుగా అమె ఆచరణలో పెట్టారు.

చిన్న తనంలో తల్లి పెట్టించిన కన్నె తులసి, చిట్టిబొట్టి శ్రావణ మంగళవారం, కైలాస గౌరి, నిత్యశృంగారం మొదలైన నోములకు స్వస్తి చెప్పారు. 1931 జనవరి లో రామంగారు జైలు నుండి తిరిగి వచ్చారు. భర్త ఆదేశంతో మాణిక్యాంబ గారు కాంగ్రెస్సు వాలంటీరుగా చేరడానికి ఉవ్విళ్ళూరుతున్నారు. భర్త ఆదేశంతో 1932లో మాణిక్యాంబగారు కాంగ్రెసు శిబిరంలో వాలంటీరుగా చేరారు. ఆకాలం నాటికి క్షత్రియ కులాలలో గోషా పద్ధతి ఉండేది. వీధుల్లో అందరిలా తిరగటానికి వీలు లేదు. బయటకు వెళ్ళవలసి వస్తే గుఱ్ఱపు బళ్ళకు తెరలు కట్టుకుని మరీ వెళ్ళేవారు. అటువంటి కుటుంబంలోని కొత్త కోడలు ఆ

గోషా పద్ధతిని వదిలి బహాటంగా రాజకీయాల్లో తిరగడం అందరికి ఆశ్చర్యాన్ని కలిగించింది. బందు వర్గంలో పెద్ద అలజడి చెలరేగింది.

ఆమె మామగారు పద్మనాభరాజుగారు దేశభక్తులు, కాంగ్రెస్‌వాది అయినప్పటికీ కోడలుపై వచ్చిన విమర్శ ఆయన తట్టుకోలేకపోయారు. పైగా కోడలు అలా బాహాటంగా మగవారితో సమానంగా తిరగడం కూడా ఆయనకు నచ్చలేదు. అందుచేత కొడుకును పిలిచి కోడలిని ఆమె తండ్రిగారికి అప్పచెప్పమని నీఅంతట నీవు ఆమెను రాజకీయాలలో ప్రవేశపెట్టడం మంచిది కాదని తెలియజేశారు. ఎందరు వ్యతిరేకించినా రామంగారు వారి మాటలు పెడచెవిన పెట్టారు. పైగా మాణిక్యాంబగారు ఆరోగ్యం, బలం కలిగిన యువతి. చక్కని కంఠం ఆమె పాలిట వరం. జాతీయగీతాలు మధురంగా ఆలపిస్తూ అందరికంటే చురుకుగా మహిళా వాలంటీరు దళంతో పని చెయ్యడం వల్ల అందరికి తలలో నాలుకగా ఉండేది. గాంధీగారు ఆంధ్రదేశ పర్యటనకు వచ్చినప్పుడు వంటిమీదున్న 70 కాసుల బంగారం వారికిచ్చివేసిన నారీమణి ఈమె.

1932 సం.లో కాంగ్రెసు ఆంగ్లేయ పాలకుల వలన తీవ్ర నిర్బంధం ఎదుర్కొంది. అప్పటికే 144 సెక్షన్ అమలులో ఉంది. మాణిక్యాంబగారు కంభంపాటి మాణిక్యాంబగారు, గుజ్జు నాగరత్నంగారు శాసనోల్లంఘనం చేస్తూ గవర్నమెంటును వ్యతిరేకిస్తూ ఏలూరు తాలూకాఫీసులో కరపత్రాలు పంచిపెట్టారు. నిర్బంధాన్ని వ్యతిరేకిస్తూ నినాదాలు చేసారు. తాలూకాఫీసునుంచి రైల్వే స్టేషను చేరుకున్నారు. అప్పటికే కాంగ్రెసు వాలంటీర్లు రహస్యస్థలంలో దాగుండేవారు. వారు వచ్చి తెల్లగుర్రపు బండి వస్తుంది అందులో రమ్మని రహస్యంగా చెప్పివెళ్ళారు. ఆ విషయం పోలీసులకు తెలిసింది. వారు ఆ తెల్లగుర్రపు బండిని తెప్పించారు. తెలియని ఈ నలుగురు ఆడువారు ఆ బండి ఎక్కారు. ఆ బండిని పోలీసులు నిర్జన ప్రాంతానికి తీసుకువెళ్ళి ఆనలుగుర్ని దిగమని వత్తిడి చేశారు. ఆ నలుగురు వనితామణులు బండి దిగమని మొరాయించారు. పోలీసులు ఎంత చెప్పినా వారు వినలేదు. అందరిలో మాణిక్యాంబగారు ధైర్యసాహసాలు కలిగిన యువతి. రైతుబిడ్డలా మొండితనంగా ఆ పోలీసులతో బండి దిగమని వాదించింది. ఏమీ చేయడానికి తోచని పోలీసులు తిరిగి వారిని తెల్లగుర్రం బండిలో రైలు స్టేషనుకు తీసుకువచ్చి దిగబెట్టారు.

అలా ప్రతీ విషయంలోనూ మాణిక్యాంబ ప్రత్యేకతను నిలబెట్టుకుంది. ఇప్పటికీ 75 సం.రాలు దాటిన మాణిక్యాంబ గారిలో ఆ ఉత్సాహం ఉరకలు వేస్తూ కనబడుతుంది. కంఠం విప్పితే ఆనాటి పాటలే వినబడతాయి.

1932లో భీమవరం డిప్యూటీ కలక్టర్ ఆఫీసు భవనం మీదున్న ఇంగ్లీషు జెండా దింపి జాతీయ జెండా ఎగురవేయడానికి కాంగ్రెసు వాలంటీర్లు సిద్ధపడ్డారు. వారిలో మాణిక్యాంబగారి మహిళా వాలంటీర్లు కూడా ఉన్నారు. వారు ముందుగానే పరాయిపాలకులకు తెలియజేశారు. అనుకున్నసమయానికి వాలంటీర్లు అడ్డదారిన బయలుదేరారు. ఆంగ్లసైనికులు బస్సుల మీద రైళ్ళమీద బయలుదేరారు. వారికంటే ముందు చేరుకున్న దేశభక్తులు పైకిఎక్కి ఆపరాయి పాలకుల జెండాను దింపి జాతీయ జెండాను ఎగురవేశారు. వారిలో మాణిక్యాంబగారు కూడా ఉన్నారు. అది ప్రజాశక్తి వెల్లువ. ఉప్పెనలా ఆశక్తి పొంగి వచ్చింది. ఆ శక్తిని అదుపుచెయ్యడానికి ఈ తుపాకులు, జైళ్ళు, లాఠీలు ఏమీ చేయగలవు? శారీరకంగా బాధలుపడ్డానికి వారు సిద్ధంగా ఉన్నారు. దేశమాత బానిసత్వమే వారికి మానసిక వేదన. ఆ అవమానం భారతీయులు భరించలేక పోతున్నారు. అందుకే భారతీయులంతా ఏకమై పోరాటం సాగిస్తున్నారు. అంతలో ఆంగ్లసైనికులు అక్కడికి చేరుకున్నారు. లాఠీ ఛార్జీ చేసారు. జెండా ఎగురవేయడానికి పైకి ఎక్కిన వారినందిరిని అరెస్టు చేసారు. తెరలమాటున అంతఃపురకాంతల్లా తిరిగే స్త్రీలు కూడా వేలమంది వాలంటీర్ల మధ్యలో చేతికి బేడీలతో జైళ్ళ పాలవడం ఎంతో ఆశ్చర్యంగా లేదు! ఒక పెట్టె తాళం పగులగొట్టడమే కష్టం. భరతమాత సంకెళ్ళు పగులగొట్టడం మాటలా?

ఆ సాయంకాలం వరకు స్త్రీ పురుషుల నందిరినీ భీమవరం తాలుకా జైలులో ఉంచారు. సాయంకాలం వారిని విడదీసి తలొకచోటికి పంపించారు. మన నాయకురాండ్రు రాయవెల్లూరు జైలుకు తరువాత కర్నూలు జైలుకు వచ్చారు. 10 నెలలు శిక్ష విధించారు. అక్కడ 60 మంది స్త్రీలు ఉండేవారు. వారిలో ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు, దుర్గాబాయమ్మగారు, వారి మాతృమూర్తి కృష్ణవేణమ్మగారు, గోగినేని భారతీదేవి మొదలైన దేశనాయకీమణుల సహవాసం మాణిక్యాంబగారికి లభించింది. అందరిలో పసల కృష్ణమూర్తిగారి భార్య పసల అంజలక్ష్మి గారితో మరింత సన్నిహితంగా ఉండేవారు. అప్పటికే

అంజలక్ష్మి గారికి ఒక కొడుకు, కూతురు ఉన్నారు. వాళ్ళను ఇంటి దగ్గర వదలిపెట్టి గర్భిణీస్త్రీ జైలుకు వచ్చారు. ఆవిడ జైలులో ప్రసవించారు. మాణిక్యాంబగారు ఆవిడకు సహాయంగా ఉన్నారు.

ఒక కంబళి కప్పుకోవడానికి, మరో కంబళి పక్కవేసుకోవడానికి జైలులో ఇచ్చారు. మడిచన చేయి వారికి తలగడ. జైలో వీరు జాతీయగీతాలైన వందేమాతరం, జండా ఊంఛారహేహమారా మొదలైన గీతాలతోపాటు భక్తి గీతాలు ఆలపించేవారు. గాంధీగారి ఆదేశమది. ఉద్యమం నడపడానికి శక్తి కావాలి. అందుకే శక్తిని, ఆరోగ్యాన్ని పెంచుకోడానికి వీరు జైల్లో ఆసనాలు వేసేవారు. అక్కడ కాలక్షేపానికి నాటకాలు వేసేవారు. హరిశ్చంద్రనాటకంలో నక్షత్రపాత్ర మాణిక్యాంబ వేసి అందరి మెప్పు అందుకున్నారు.

మాణిక్యాంబగారు తాటికొబ్బరి చెట్లు ఎక్కడంలో సిద్ధహస్తురాలు. కర్నూలు జైలులో ఉన్న కొబ్బరిచెట్లు ఎక్కి అవతల వార్డులో ఉన్న మగవారికి ఉత్తరాలు గిరవాటువేసే వారు. వారికి కావలసిన సమాచారం అందించేవారు.

జైల్లో పెట్టగానే వీరి కట్టుబట్టలు మార్పించి జైలు బట్టలు ధరింప చేసారు. ఈ స్త్రీలు 3 రోజులు భీష్మించి నిరసన వ్రతం పూనారు. జర్మన్ సిల్వర్ పళ్ళాలలో భోజనం చేయడానికి కూడా ఈ స్త్రీలు అంగీకరించక నేల కడుగుకొని ఆగచ్చుమీద భోజనాలు చెయ్యడం మొదలుపెట్టారు. అది తెలిసిన టంగుటూరు ప్రకాశం పంతులు గారు జైలు సందర్శించడానికి వచ్చారుట.

అక్కడ పరిస్థితిని అర్థం చేసుకుని జైలు అధికారులతో మాట్లాడి వీరి బట్టలు, వీరి కంచాలు వీరికిప్పించారుట.

జైలు నుంచి తిరిగి వచ్చిన తరువాత ఈవిడ భర్త, పిల్లలతో కావూరు ఆశ్రమం, వినయాశ్రమం, మంతెన వారిపాలెం ఆశ్రమాలలో కాలక్షేపం చేసారు.

మంతెన వారి పాలెం ఆశ్రమంలో వందలాది భక్తులకు నివాసం, భోజనాలు వండి పెట్టడం మాణిక్యాంబగారి పని. ఓరుగంటి వెంకటేశ్వరరావుగారు హిందీ పండితులు. అందరికీ హిందీ నేర్పేవారు. మాణిక్యాంబ గారు హిందీ విశారద వరకు ఆయన దగ్గరే చదువుకున్నారు. వీరేశలింగం పంతులుగారి ప్రభావంతో ఒక వితంతు వుతో వెంకటేశ్వరరావుగారికి

మాణిక్యాంబగారు దగ్గరుండి వివాహం జరిపించారు.

కాంగ్రెస్ నేతలైన అల్లూరి సత్యనారాయణరాజుగారు, కోసూరి సుబ్బరాజుగారు కూడా ఈ ఆశ్రమంలో ఉండేవారు. ఈ ఆశ్రమంలో ఉండగానే నేత నేయడం, విదేశీ వస్త్రదహనాలు ఈవిడ అందరితోపాటు చాలా ఉత్సాహంగా చేసేవారు.

1938లో కాశీపట్నం జమీందారీ వ్యతిరేక పోరాటంలో మహిళావాలంటీర్లకు నాయకురాలిగా పనిచేసి అల్లూరి అన్నపూర్ణమ్మగారితోపాటు జైలుకు వెళ్ళారు.

1940లో భర్త రామంగారు కమ్యూనిస్టు పార్టీ వైపు మొగ్గు చూపారు. భర్త వెంటే భార్య. రష్యన్ రచయిత గోర్కీ అమ్మ చదివిన ఈవిడ ప్రభావితురాలై భర్త జైలులో ఉండగా పనిచెయ్యడం ప్రారంభించారు. అప్పటికే ఈవిడకు ముగ్గురు మగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు. అందరికంటే పెద్ద మనకమల.

ఈవిడ పిల్లలతో వెంట్లపాలెం ఆశ్రమంలో పుచ్చలపల్లి సుందరయ్యగారితో మృత్యుంజయరావుగారితో పనిచేశారు. ఏ పార్టీలో చేరినా వీరి ఆశయం భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొని విజయం సాధించడమే, ఏ పార్టీయైతేనేమి దేశమాత బంధనాలు విడిపించడం కన్న వారికి ముఖ్యమేముంది. బ్రిటీషువారిని ఎదిరించడానికి కొన్నాళ్ళపాటు రహస్య స్థావరాలలో నివసించారు. మారు వేషాలు వేసుకొని గొడ్ల పాకల్లో నివసించారు. తినడానికి తిండి లేదు. మొలలో రహస్యంగా దాచితెచ్చుకున్న ఉల్లిపాయలు, ఉప్పుకారం దంచుకుని కాస్తగంజి కాచుకొని తిని ప్రాణాలు నిలుపుకున్నారు. పట్టుదలను పెంచుకున్నారు.

చేతిలో పైసాలేదు. పార్టీ డబ్బుకోసం కూలీ పని చేయవలసి వచ్చింది. బయటకు వెడితే పోలీసుల అరెస్టు. అందుకే కూలీల మధ్యలో మారువేషాలలో పనిచేసేవారు. రెండు వరుసల కూలీల మధ్యలో వీరిని పెట్టి బ్రిటీషు సైనికులకు అనుమానం రాకుండా పనిచేసి ఆ డబ్బు తెచ్చి పార్టీకి ఇచ్చేవారు. ఈనాడు ఇది చదివిన వారికి ఆశ్చర్యంగా అనిపించవచ్చు. ఈ సంఘటనలు ఆవిడ స్వయంగా చెప్పిన విషయాలు. అది కనిపెట్టిన కర్కశ పాలకులు వారి వెంట పడ్డారు. మాణిక్యాంబగారు మరో వేషం మార్చారు. జైల్లో ఉండగా కలిగిన అనుభవంతో

కామరాజు అచ్చమాంబగారి దగ్గర పొందిన శిక్షణతో మంత్రసానులై ఆడువారికి పురుళ్ళు పొయ్యడం ప్రారంభించారు. సుమారు 100 పురుళ్ళు ఈవిడపోసి వారి దగ్గర 116 రూ.లు తీసుకొని ఆ డబ్బును కూడా పార్టీ ఫండుకు అందజేసిన త్యాగమూర్తి ఈమె. కొందరి దగ్గర ధనం కాకుండా స్వయంపాకం ( బియ్యం, పప్పులు, కూరలు వగైరాలు) కూడా తీసుకుని పొట్టలు పోషించుకున్నారు. కొన్నాళ్ళకు ఇదీ సాధ్యపడలేదు. అవసరానికో వేషం అన్నట్లుగా కోడిగుడ్లు, మాంసం మొదలైనవి అమ్మి ఆ ధనాన్ని పార్టీ ఫండుకు ఇచ్చేవారు.

నర్సాపురంలో ఉన్న ప్లీడరు నోరు నారాయణ మూర్తిగారు పార్టీ కార్యకర్తలకు హోమియో వైద్యం నేర్పించారు. మాణిక్యాంబగారు కూడా ఆ వైద్యం నేర్చుకుని పిల్లలకు, మహిళలకు అనారోగ్యం వచ్చినప్పుడు హోమియో మందులు ఇస్తూండేవారు.

ఇంట్లో గేదెను, కోళ్ళను పెంచుతూ పిల్లలను, చదివిస్తూ భర్త అండర్ గ్రౌండులో ఉన్నప్పుడు చాలా ధైర్యంగా, సమర్థవంతంగా సంసారం ఈదుకొచ్చిన వీర నారీమణి ఈమె.

రామంగారు కోరుకొల్లులో అరెస్టు అయి పోలీసుల నుండి తప్పించుకుని పారిపోయారు. భర్త ఎక్కడున్నాడో ఆవిడకే తెలియదు. అటువంటి సమయంలో పోలీసులు ఆమె మీద మరింత నిఘా పెంచారు. భర్త ఎక్కడున్నాడో చెప్పమని ఆవిడను వేధించడం మొదలుపెట్టారు. ఆవిడకు నిలువ నీడ కూడా లేకుండా చెయ్యాలని అద్దె ఇళ్ళ వాళ్ళను బాధించారు. ఇంటిమీద తాటి ఆకులను కూడా లాగిపారేస్తూండేవారు. అయినా ఆమె భయపడలేదు. పిల్లలను తండ్రి ఎక్కడున్నది చెప్పమని వేధించేవారు. పైగా నీ భర్త మంచివాడు కాదని నీచ స్త్రీలతో అక్రమ సంబంధాలు పెట్టుకున్నాడని ప్రచారం చేసినా ఆవిడ వినలేదు. ఒకరోజు పోలీసులు వచ్చి రామంగారిని అమలాపురంలో పట్టుకుని కాల్చివేసారని ఒక నీలివార్త పుట్టించారు. మాణిక్యాంబకు ఆయన సంగతి తెలుసోతెలీదో తెలుసుకోవాలని అలా పుకారు పుట్టించారు.

రామంగారి సంగతి నిజంగా తెలయని మాణిక్యాంబ గారు పిల్లలను తీసుకుని పాలకొల్లు వెళ్ళింది. అక్కడ పార్టీ ఆఫీసులో అభిమానులను

అమలాపురం పంపి అసలు సంగతి తెలుసుకుంది. పోలీసు మాయను గ్రహించి ధైర్యంగా ఇంటికి తరిగి వచ్చింది.

ఆమె జాతీయ ఉద్యమంలో కాంగ్రెసు కార్యకర్తగా చేసిన సేవకు, కమ్యూనిస్టు పార్టీలో ఉండి చేసిన సేవకు ఫలితంగా భారతావనికి స్వాతంత్ర్యం వచ్చింది. దేశనాయకుల కలలు పండాయి. 1947 ఆగస్టు 15 భారతీయులందరికీ సంతోషదినం. ఉద్యమకారులకు గర్వకారణం.

శ్రీమతి మాణిక్యాంబగారు నీరవాసరంలో ఉండగా స్వరాజ్యం వచ్చిన వార్త విన్నది. ఆమె సంతోషానికి అంతులేదు. భారత స్వాతంత్ర్య కోసం ధనాన్ని, శక్తిని, సమయాన్ని, తన సర్వస్వాన్ని అర్పించి తన కర్తవ్యాన్ని నెరవేర్చారు.

స్వరాజ్యం వచ్చిన తరువాత ఆవిడ ఏ పదవులకోసం ఆశపడలేదు. భర్త రామంగారు పాలకొల్లు నుంచి ఎమ్.పి.గా ఎన్నికై దేశ సేవ చేసారు. ఆయన చనిపోయిన ఆవిడ హైదరాబాదు వచ్చి పెద్దకూతురు కమలగారి దగ్గర ఎంతో తృప్తిగా ఉంటున్నారు. ఆవిడ నిరాడంరత్వమే ఆవిడ ఆదర్శానికి చిహ్నం. దేశభక్తి ఆవిడ నరనరాలలో జీవించి ఉంద. మహాత్మాగాంధీ నంటి దేశనాయకులు, ప్రకాశం పంతులు, భోగరాజు వంట వారికి అభిమానం ఆమెను కదిపితే ఆవిడ నోటిమాట జాతీయగీతాలై వస్తాయి. 83 సం.రాలు వచ్చినా ఆమె ఉత్సాహమే ఆమెకు ఊపిరి, తరగని పట్టుదలే ఆమె ప్రాణం. మాణిక్యాంబగారు ఆలపించిన జాతీయ గీతాలు.

భీమవరంలో.తాలూకాఫీసునీద జెండా ఎగుర వేయడానికి మాణిక్యాంబగారు ఆలపించినది.

''కుండుపై జాతీయ జండా ప్రతిష్ఠింప
రండోయి! రండు! రారండు!
దండిగ పైరులు గుండులు ప్రేల్చిన
చెండుచు నెత్తురు, క ండలురాల్చిన
జెండా యెత్తర! జాతికి ముక్తిర''

అదే విధంగా జైల్లో ఉన్నప్పుడు మహాత్ముని గూర్చి

''జగద్రక్షకుడు గాంధీమహాత్ముడు జనులందరు మీరెరుగండి.
జగతిని ధర్మము స్థాపన సేయగ జన్మించిన హరి ఇతడండి
హిందూ దేశము నుద్ధరించుటకు హిందువుడై జన్మించెన్
హిందూ సోదరులారా - మీరిదె - డెందము పలదలచండి''

అదే విధంగా

''మేలుకొను మీ భరతపుత్రుండ
మేలుకొను మీ సచ్చరిత్రుండ
మేలుకొను మయ్యవత్సా                    //మేలు//
వేడుకను జాతీయతాయను
వేగుచుక్క పొడిచె నదిగొ
కూడి వందేమాతరం'' బని
కుక్కుటములరచెన్                    //మేలు//

మహాత్ముని గూర్చి పాడుతూ

''రఘుపతి రాఘవ రాజారామ్ - పతిత పావన సీతారామ్
ఈశ్వర అల్లా తేరే నామ్ - సబ్‌కో సన్మతి దేభగవాన్''
//రఘుపతి//

నూలు వడుకుచు

''నూలు వడికే విధము తెలియండి - జనులార - మీరు
విధము గనుగొని - లాభ మొందండి
నూలు వడికే విధము తెలియక - సాలు కరువ
కోట్ల రూపాయలు వ్యర్థము గాను - పరదేశాలపాలు సేయ బోకను
//నూలు//

జైలును గూర్చి పాడన పాటలు

''జనమందేలా జైలు కలపోసీ                    //జన్మ//
ధర్మము తోడను - జన్మ భూమికి మన
నిర్మల త్యాగము నొసగని వాని''                    //జన్మ//
వీరమాతలకు - కారాగార విముక్తులకు
చేరినమస్కరింప - చేతులెత్తనివాని                    //జన్మ//

జైలు ప్రబోధ గీతము

జైలనగనే మిగుల సుఖము - వీలుగా నుండు మనకు
వేళకు స్నానాలు - వేడి వేడి భోజనాలు !!జైలనగనే!!

హెచ్చు పన్ను అచట లేదు - రొచ్చు కంపు లేదు
గచ్చుచేసిన లోగిళ్ళు - ఘనమైన నాకిళ్ళు !!జైలనగనే!!

కృష్ణజన్మస్థలము నుండ - ఐకమత్యము తోనుండ
శ్రీ కింగు జార్జి విందు నుండ - శ్రీకరముగ బిళ్ళదండ
!!జైలనగనే!!

## శ్రీమతి ఉద్దరాజు మాణిక్యాంబ గారి అభిప్రాయం

ప్రశ్న : స్వరాజ్యం వచ్చిన తరువాత మన దేశ పరిస్థితి ఎలా వుందంటారు?

సమాధానం : స్వరాజ్యం వచ్చిన తరువాత ఉద్యమ నాయకులు కలలు కన్నట్లుగా దేశపరిస్థితి బాగుపడలేదమ్మా! దౌర్జన్యాలు, దోపిడీలు, మానభంగాలు, మోసాలు ఎక్కువైపోయాయి.

ప్రశ్న : దీనికి కారణం ఏమిటంటారు?

సమాధానం : స్వార్థమే కారణం. రాజకీయ నాయకులలో నిజాయితీ లేదు. అందుకే అన్యాయాలు, అక్రమాలు ఎక్కువైపోయాయి.

ప్రశ్న : ఈనాటి స్త్రీలను గురించి మీ అభిప్రాయం!

సమాధానం : స్త్రీలు బాగా చదువుకొంటున్నారు. కాని వీరిలో పరోపకార బుద్ధి చాలా తక్కువ, స్వార్థంపాలు ఎక్కువ. పైగా తమ పనులు తామే చేసుకోలేకపోతున్నారు. ఇరుగు పొరుగులకు ఏమి సాయం చేస్తారు.? ఆడవాళ్ళలో చైతన్యం రావాలి. అప్పుడే దేశం బాగుపడుతుంది.

ప్రశ్న : వరకట్నాలు రోజు రోజుకీ పెరిగిపోతున్నాయి! దీనికి కారణం ఏమిటంటారు?

సమాధానం : అప్పనంగా డబ్బు వస్తుంటే ఎవరు కాదంటారు! ఇది కూడా లంచం లాంటిదే. అసలు పుచ్చుకునే వారికంటే యిచ్చే వారిదే తప్పు. అటువంటి వారిని వదిలిపెట్టకూడదు. ప్రభుత్వం, పోలీసులు వారు దండించవలసింది ప్రజలే దండించాలి. అప్పుడే వారు లొంగుతారు. నలుగురి మధ్యలో నిలదీసి అడగాలి. ప్రజలు వూరుకోకూడదు. ప్రతి పౌరునికి దండించే హక్కు వుంది.

ప్రశ్న : ఏదైనా ఒక సంఘటన గురించి చెప్పండి!

సమాధానం : ఒకావిడ అందరినీ సత్యనారాయణ వ్రతానికి పిలిచింది. నన్ను పిలువలేదు. అయినా వెళ్ళాను. నన్ను చూసి ''మీ కమ్యూనిష్టులకు వ్రతాలెందుక''ని అడిగింది. నేను వెంటనే లోపలికి వెళ్ళి దేవుని దగ్గర దీపం వెలిగించి 'కేశవ! నారాయణ! మాధవా!'' అంటూ మంత్రాలన్ని చదివి నైవేద్యం పెట్టి లేచాను. ఆవిడ నన్ను చూసి ఆశ్చర్యపోయింది. ''అమ్మా! దీపం వెలిగించడం ఎందుకనుకున్నావు! నలుగురికి వెలుగు పంచడానికి! ఇన్ని నోములు, వ్రతాలు చేస్తున్నావు! దేనికోసం. పుణ్యం కోసమే కాదమ్మా! పరోప కారబుద్ధి ఉండాలి., మానవత్వం పెంచుకోవాలి. అంతేకాదు, కమ్యూనిస్టులంటే ఎవరనుకుంటున్నావు? పరోపకార బుద్ధి కలిగిన వారు, న్యాయ సంరక్షణ చేసేవాళ్ళు. నువ్వు వ్రతం చేసావు. కాని పూజ విధానమే రాదు. ఒక మంత్రం నోటికి రాదు. కాని నాకు అన్నీ వచ్చు. దేనికైన కార్యదక్షత ఉండాలి. నటన ప నికి రాదు.'' అని చెప్పి ఇంటిక తిరిగి వచ్చాను. ''ఆ కార్యదీక్ష ఆనాటి వారిలో ఉండబట్టే పరాయి పాలకులు గడగడలాడారు. దేశాన్ని వదిలి పారిపోయారు. తెలిసిందా! ఎప్పటికైనా మన స్త్రీలలో, పురుషులతోపాటు పట్టుదల, కార్యదీక్షత ఉంటే తప్పకుండా ఈ దేశం బాగుపడుతుంది'' అన్నారావిడ.

ఆవిడ కోరిక నెరవేరుతుందని ఆశిద్దాం.

**జైహింద్**